రూపురంగులనిచ్చే పసుపు బంగరు
యాత్రలకు కారణం ఆయుర్వేద మూలికలే.

# హిమానీ గోల్డ్

## టర్మరిక్ సబ్బు మరియు క్రీమ్.

ఎవరికి తెలియదు చర్మ సౌందర్యాలకు పసుపు ఎంత సహాయ కారిణి అని. కానీ యీ తొందర రోజులలో శనగపిండితో కలిపి ప్రతి దినం ఎవరు వాడతారు... శనగపిండి లేకుండా కేవలం పసుపు మాత్రం కలసి ఉన్న చర్మ సౌందర్య సాధనాలు ఎలా చర్మాన్ని కాపాడగలవు ?

సంవత్సరాల తరువాత యీ సమస్యకు సమాధానంగా కనిపెట్టారు భారత విఖ్యాత రవీంద్ర పురస్కార విజేత శ్రీ శివకాళీ భట్టాచార్యగారు సౌందర్య సాధనాలలో కలిపెందుకు గాను పసుపుతో సహా తులసీ, గోరింట వట్టి వేళ్ళు, చందనం మరియు పద్మకముతో వనమూలికల గుణములు కలిసినట్లయితే చర్మ సౌందర్యాలకు పసుపు ఇస్తుంది ఒక ప్రత్యేకతను. శనగపిండి లేదే అన్న సమస్య మరి లేదు. సంపూర్ణ బంగరు ఛాయలు అలా నిలుస్తాయి.

ఔను—ఆయుర్వేదపు యీ అమూల్య అన్వేషణా ఫలితం లభిస్తోంది పూర్తిగా హిమానీ గోల్డ్ టర్మరిక్ సబ్బు లేక హిమానీ గోల్డ్ టర్మరిక్ క్రీమ్‌లో సదా. ఇతే భారత దేశంలో ప్రప్రథమం.

ఇప్పుడు మీ చర్మంలో క్రీమ్ మరియు సబ్బుల యొక్క ఆయుర్వేధ గుణం అతి సహజ సౌందర్యాలతో మిళితమై శరీరం బంగరు ఛాయలతో మిరిమిట్లు గొలుస్తోంది.

ఔను—అందరు అందాలను రెప్ప వేయకుండా చూస్తారు.

శాస్త్రాలలో వర్ణించబడిన నవ ఔషదాల శ్రేష్టగుణములు:



పసుపు : ముఖావికిస్తుంది అందాల ఆహ్లాదాలను.



గోరింట : రంసరూపాలను అధిక కాంతివంతం చేస్తుంది.



తులసి : చర్మంపైన మరకలను నిర్మూలిస్తుంది.

చందనం : అరిన చర్మాలకు అందాల నిస్తుంది.



పద్మకము: చర్మ రోగాలను నిర్మూలించి జీవాణువులను నాశనం చేస్తుంది.



★కొబ్బరినూనె .చర్మ కోమలత్వాన్నిచ్చి సహజ సౌందర్యాన్నందిస్తుంది.



★వేపనూనె: జీవాణువులను నష్టపరచి చర్మ రోగాలను నిర్మూలించేందుకు దోహదాన్నిస్తుంది.

★సబ్బులో మాత్రమే.





హిమానీ గోల్డ్ సబ్బు మరియు క్రీమ్

బంగరు సుదినాల సౌందర్యాన్ని తిరిగి తీసుకొస్తోంది

9580A/1TEL

BLACK

"నాకు నచ్చిన వ్యక్తి"

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## వ్యాస రచన పోటీ



**మొదటి బహుమతి : పోర్టబుల్ బ్లాక్ అండ్ వైట్ టి.వి.**

**రెండవ బహుమతి మిక్సర్**





**మూడవ బహుమతి : పెద్ద సూట్‌కేస్**

**ప్రత్యేక బహుమతులు 3 హెచ్.ఎం.టి. చేతి గడియారాలు**



## నిబంధనలు

1 ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు

2 వ్యాసంలో మీకునచ్చిన వ్యక్తిగా ఇప్పుడు జీవించి ఉన్న వారిలో ఎవరినైనా పేర్కొనవచ్చు

3 వ్యాసం ఒక అరఠావు (సుమారుగా 17×29 సెం మి) మించరాదు కాగితానికి ఒకవైపే సిరా లేదా బాల్‌పెన్‌తో రాయాలి

4 ఈ పేజీలలో ఇచ్చిన ప్రశ్నావళి కూపన్‌లని పూర్తి చేసి వ్యాసంతో పాటు విడిగా పంపాలి వ్యాసం రాయనివారు కూడా ప్రశ్నావళి పూర్తిచేసి పంపవచ్చు

5 పోటీకి పంపిన వ్యాసాలని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపటం సాధ్యంకాదు కాబట్టి వాటితోపాటు స్వంత చిరునామాకల స్టాంపులు అంటించిన కవర్లు జతపరచవద్దని కోరుతున్నాము

6 గడువుతేదీ 31–5–1986 ఆ తర్వాత అందిన వ్యాసాలు పరిశీలింపబడవు

7 ఈ పోటీలో తుది నిర్ణయం సంపాదకునిదే పోటీలో పాల్గొనే వారంతా దానికి బద్ధులై ఉండాలి దీని విషయమయి ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు

8 పోటీకి పంపే వ్యాసాలని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక గాంధినగరం విజయవాడ-520003 అన్న చిరునామాకి పంపాలి కవరుమీద నాకు నచ్చిన వ్యక్తి వ్యాసరచన పోటీకి అని స్పష్టంగా రాయాలి

పాఠకులందరూ ఈ పోటీలో ఉత్సాహంగా పాల్గొని దీనిని జయప్రదం చేయవలసిందిగా కోరుతున్నాము

–సంపాదకుడు

# ప్రశ్నావళి

**ముగింపు తేదీ : 31–5–1986**

1 నాకు ఎక్కువ నచ్చిన శీర్షిక ________________

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2 | కథలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 3 | సీరియల్ నవలలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 4 | సినిమా శీర్షిక | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 5 | న్యూఢిల్లీ లేఖ | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 6 | హైదరాబాద్ నోట్‌బుక్ | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 7 | బొమ్మల కథ | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 8 | వారఫలాలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 9 | ప్రశ్నావళి | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 10 | డాక్టర్ సలహాలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 11 | దర్మపథం | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 12 | కార్టూన్లు | చూస్తాను | ☐ | చూడను | ☐ |
| 13 | కవిత | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 14 | ఉత్తరాలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 15 | సినిమా శీర్షికలో సినిమా ప్రముఖులతో ఇంటర్వ్యూలు | ఉండాలి | ☐ | ఉండనక్కరలేదు | ☐ |
| 16 | వ్యాసాలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 17 | ఆంధ్ర సచిత్ర వారపత్రికకి లేఖలు | రాస్తాను | ☐ | రాయను | ☐ |
| 18 | ఆంధ్ర సచిత్ర వారపత్రిక నాకు సక్రమంగా | అందుతోంది | ☐ | అందటంలేదు | ☐ |
| 19 | నేను ఆంధ్రసచిత్ర వార పత్రికని తెప్పించేది | ఏజెంటుద్వారా | ☐ | పోస్టుద్వారా | ☐ |
| 20 | నేను ఆంధ్రసచిత్రవార పత్రికని ప్రతివారం షాపులో కొంటాను | అవును | ☐ | కాదు | ☐ |

(తగిన విధంగా ఆయా గడులలో ✓ గుర్తుపెట్టండి)

- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -

కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## "నాకు నచ్చిన వ్యక్తి"

వ్యాస రచన పోటీ

వ్యాసం రాసిన వారి పేరు : ..............................

పూర్తి చిరునామా : ..............................

..............................

..............................

..............................

KASI

## వెలువడింది!....

### మే 16-31 సంచిక

వెల రు 2 50

**కథలు**

తూర్పు పడమర
శివమ్మ జాలి కథ
అసలు రహస్యం
కుంపటి సుఖం
తప్పెవరిది



**సీరియల్స్**

ఉషోదయం
స్వర్గం చేజారిందా?
ఓ నీరజ కథ



**శీర్షికలు, వ్యాసాలు**

* ఆడవారి సమస్యలకు అంతం?
* మహిళా పోలీస్ స్టేషన్లు
* రకరకాల జడలు



ముఖచిత్రం

ఈ కాలంలో నూలు చీరలే సుఖం

నటి సుమలత

టి టి కృష్ణవేణి
పిలింతార చాయ, టిపిన్ వడియాలు
తొలి భారతీయ మహిళలు ,
అందంగా ఉండటం కష్టమేమీ కాదు ,
చెంచాల చెవుల పిల్లి, యోగం మోక్ష సాధనం, త్రాగటానికి సాకులు వెతికే మగాళ్లు , మ్యాజిక్-మ్యాజిక్
నగలమీద మోజు అతివలూ మీకు తెలుసా?, మహిళా వికాసం

*రక రకాల మల్లెపూల జెడలు

# కలువబాల

వివరాలకు 'కలువబాల', కేరాఫ్ ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 3

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938 1972)

30 మే 5 జూన్, 1986

శ్రీ అక్షయ నామ సం వైశాఖ బ సప్తమి

సంపుటము 78 సంచిక 38

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు 2-50

పోస్టులో 6నెలల చందా రు 71 50

పోస్టులో 12నెలల చందా రు 143 00

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాందినగరం విజయవాడ 520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం

నటి శ్రీదేవి

(ఫొటో జగ్‌మోహన్)

### కథలు



### సీరియల్ నవలలు



### వ్యాసాలు, శీర్షికలు






## ముఖచిత్రం

సుజాత ముఖ చిత్రంతో వెలువడిన 18 24 ఎప్రల్ 86 ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖ చిత్రం చూడ ముచ్చటగా ఉంది పదహారణాల తెలుగింటి ఆడపడుచులా నిండుగా కన్నుల పండువుగా ఉంది

డి విజయలక్ష్మి నర్సింగరావు పటానుచెరువు

## సీరియల్స్

18 24 ఎప్రిల్ 86 నాడు సుజాత ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక చాలా బాగుంది వసంతగీతం జీవితం చేజారిందా? అను సీరియల్ నవలలు చాలా ఆసక్తికరముగా ఉన్నాయి బ్రూస్‌లీ చరిత్ర వేగంగా ముగించడం చాలా విచారంగా ఉంది

దువ్వాడ శ్రీకాంత్ శ్రీను కాశీబుగ్గ

## బ్రూస్‌లీ చరిత్ర

18 24 నాడు సుజాత ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక చాలా ఆకర్షనీయంగాను ఆసక్తికరంగాను ఉంది ఈ పత్రికలో వెలువడిన బ్రూస్‌లీ చరిత్ర ముగింపు చాలా బాగున్నది

యోహిన్ కాశీబుగ్గ

## మాత ఎవరు?

ఏప్రిల్ 25–మే 1 వారపత్రికలో శ్రీ అరవిందాశ్రమం అమ్మను గురించి డా గు ర బా గారి రచన మీ పత్రిక స్థాయిని దిగజార్చేట్టుగా ఉంది 1926లో నవంబర్ 24వ తేదీన శ్రీ అర విందులు అదిమానస సిద్ధి పొంది పృద్వి చైతన్య పరిణమములో తర్వాతి దశయగు అతిమానసమును భూమి మీద అవతరింప చేయడానికి ఏకాంతంలో నికి వెళ్ళారు ఆశ్రమ నిర్వహణ బాద్యత తల్లిగారికి అప్పగించి శ్రీ మాతయే శ్రీ అరవిందుల పూర్ణయోగ సాధనకు మార్గదర్శిగా ఉంటారని శిష్యులకు తెల్పారు అప్పటి నుండి శ్రీ అరవిందాశ్రమ నిర్వహణ బాద్యత శ్రీ మాత స్వీకరించి శ్రీ అరవిందుల పూర్ణయోగసాదకులందరికి శ్రీ అరవిందాశ్రమం తల్లిగా వారి హృదయాల్లో స్థానం పొందారు తల్లి దివ్యమాత అద్యశక్తి అని శ్రీ అరవిందులు తెల్పారు ఆమె రచనలు 15 సంపుటాలుగా వెలువడ్డాయి డా గు ర బా గారి ప్రశ్న సమంజసంకాదు

–బి వి ప్రసాద్‌రెడ్డి కొటపోలూరు



## వ్యాసం-కథ

శ్రీ డా జి ఆర్ బి గారి అరవింద ఆశ్రమంలోని మాత ఎవరు? వ్యాసం చక్కగా వుంది నన్నెంతగానో ఆకర్షించింది బలివాడ కాంతారావుగారి బానిస బ్రతుకులు పెద్ద కథ ఇంటరెస్టింగ్‌గా వుంది అపుడప్పుడు చక్కని వ్యాసాలను ప్రచురించి మమ్ము ఆనందింపచేస్తున్న మీకు నా ధన్యవాదాలు

కె వి యన్ రావ్ నెల్లూరు

## ధర్మపథం

18–24 ఆంధ్ర సచిత్రవారపత్రిక నటి సుజాత ముఖచిత్రం ఎంతో ఆకర్షనీయంగా వుంది తన్ను కన్నతల్లిని ఆదరంతో చూచి ఆమె సుఖ సంతోషాలకు ప్రయత్నించటం ధర్మమ్మునట్లు జన్మ భూమిని గౌర వించడం కూడ ముఖ్యమైన దర్మమే ధర్మపదం శీర్షికలో – బులుసు వేంకటరమణయ్యగారు చక్కగా వివరించారు

–జిట్టా రమణిమోహన్ కడప

## నిజమైన పాత్రకు ప్రతిబింబం

18–24 ఏప్రిల్ పత్రికలో వైశాలిరెడ్డి గారితో ఇంటర్వ్యూ సమాజంలోని ఒక నిజమైన పాత్రను అద్దం పట్టి ప్రతిబింబింప జేసి నంత స్వచ్ఛంగానూ యదార్ధంగానూ ఉంది వారు –అడిగిన ప్రశ్నలకు సూటిగానూ నిర్భయంగానూ సమాధానాలు ఇవ్వగలిగినా గాని బారతీయ సంస్కృతి మంచిదన్న నమ్మకం గల స్త్రీ గా తన నిజజీవితంలో అటువంటి అబిప్రాయాలు ఏర్పరచుకొన గూడనివి నిజంగా తెలిసి నేరం చేసేవాళ్ళని మార్చడం కొసమే వాళ్ళని సమాజానికి దూరంగా జైళ్ళలో ఉంచేది అంత మాత్రం చేత నిజమైన నేరస్తుణ్ణి ప్రేమించాలని ఎక్కడుంది? అది ఒక రకమైన గొప్పదనంగా బావిస్తే చేయగలిగిందేముంది? మన జైళ్ళలో నిజంగా నేరం చేయని నిర్దోషు లు అకారణ రాజకీయాలకు బలిఅయి కాలం వెళ్ళదీస్తున్నారు అలాంటి ఏ ఒక్కరిపై లేని ప్రేమ డబ్బున్న చార్లెస్ పైనే ఎందుకో వైశాలిగారికి ప్రేమ?

–నద్దినేని వేంకటేశ్వరరావు సంగం జాగర్లమూడి

## స్మగ్లర్ ప్రియురాలు

సుజాత ముఖచిత్రంతో వెలువడిన మా (మ) పత్రికలో అంతర్జాతీయ స్మగ్లర్ ప్రియురాలు శ్రీమతి వైశాలిరెడ్డితో ఇంటర్వ్యూ చాలా బాగుంది

–బందిగి బాలరాజు నారాయణపేట

## గమనిక

సకాలానికి అందని కారణంగా ఈవారం న్యూడిల్లీ లేఖ వెయ్యలేక పోతున్నాము –సం □

# ఆరోగ్యానికి పరమౌషధం పోషకాహారం!

ఆరోగ్యమే మహాభాగ్యమని నానుడి ఆరోగ్యవంతుడైన మానవుడే ఏ పనైనా సాధించగలడు మనిషిని మానసికంగా వికసింపజేసేది ఆరోగ్యమే! శారీరకంగా ఉత్తేజపరిచేది ఆరోగ్యమే! అందుకే అది మానవుని పాలిటి మహాభాగ్యమైంది అంతటి భాగ్యాన్ని మనకు అందించేది మనం నిత్యం తీసుకొనే ఆహారమే!

లాంగ్ అయిలండ్ విశ్వవిద్యాలయానికి చెందిన డా విల్లియమ్ గోల్డ్ విగ్ చెప్పినట్లు మని. ఆలోచనా స్థాయినీ ఆచరణా సామర్థ్యాన్నీ నిర్దేశించగలిగేది తీసుకొనే ఆహారం మాత్రమే! నిత్యం దేహంలో ఉన్న కోట్లాది కణాలకు (60 ట్రిలియన్‌ల జీవకణాలు ఉంటాయని అంచనా!) స్ఫూర్తివంతమైన శక్తిని అందించగలిగే ఆహారమే నిర్దుష్టమైన పోషకాహారమవుతుంది

హైదరాబాద్‌లో ఉండే నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్ వారి నివేదిక ప్రకారం మనం తీసుకునే ఆహారపదార్థాలలో క్రొవ్వు పదార్థాలు 8 నించి 10 మోతాదుకన్నా 50 శాతం కొలెస్టరాల్ ఎక్కువైనా హృద్రోగం రావడానికి అవకాశం ఉందని ప్రకటించడం గుర్తించదగ్గ అంశం గొడ్డు మాంసంలో పంది మాంసంలో కొలెస్టరాల్ అధికంగా ఉంటుంది కాబట్టే అవి రెండూ బాగా స్వీకరించే బ్రిటన్ కెనడా అమెరికా ఈజిప్టు ఇజ్రాయిల్ సౌదీ అరేబియా ప్రాంతాలలో కొలెస్టరాల్‌కి సంబంధించిన హృద్రోగులు ఎక్కువగా ఉన్నారని అనుకోవచ్చు! అమెరికన్‌లు కార్బోహైడ్రేట్‌లను స్వీకరించడం బాగా తగ్గించి ప్రొటీన్‌లనీ క్రొవ్వులనీ ఎక్కువగా తీసుకోవడానికి అలవాటు పడడంవల్లే వారు హృద్రోగాలపాలవుతున్నారని డా బెంజమిన్ ఫ్రాంక్‌లిన్ ఫ్రీడమ్ ఫ్రమ్ హార్ట్ ఎటాక్స్ అనే గ్రంథంలో నిర్ద్వంద్వంగా ప్రకటించారు కూడా!! మనదేశంలో హృద్రోగులు లేరనికాదు ఎంతోమంది ఉన్నారు అయితే వంశపారంపర్యంగానో రక్తపోటు వల్లనో మధుమేహం వల్లనో ధూమపానం వల్లనో ఈ హృద్రోగాలు

డాల్ తెలియజేస్తూ తీసుకొనే ఆహారంలో తగిన పాళ్లలో విటమిన్‌లూ ఖనిజ లవణాలూ లేకపోతే కాన్సర్ వచ్చే అవకాశాలు ఎక్కువవ్వడమే కాక రేచీకటి నరాల బలహీనత దొడ్డికాళ్లు మందబుద్ధి రక్తలేమి తదితర వ్యాధులు కూడా ప్రబలే పరిస్థితులు తారసిల్లుతాయని హెచ్చరిస్తున్నారు

మనం భుజించే ఆహారంలో కార్బోహైడ్రేట్‌లు ప్రొటీన్‌లు క్రొవ్వులు ఖనిజ లవణాలు! విటమిన్‌లూ అన్నీ సమపాళ్లలో ఉండాలి మనిషిని పుష్టికరంగా తయారు చేయగలిగితేనే పోషకాహారమవుతుంది పోషణ శాస్త్రజ్ఞుల సూచనల మేరకు ఆహారాన్ని స్వీకరించడం ఎంతైనా అవసరం విటమిన్ మాత్రలు మింగినంత మాత్రాన పోషకాహారాన్ని స్వీకరించినట్లుకాదు తాజా ఆకు కూరలు ఎక్కువగా వాడుకోవాలి మాంసాహారాన్ని మితంగా తీసుకోవాలి క్రొవ్వు పదార్థాల మోతాదును సాధ్యమైనంత వరకు తగ్గించుకొంటే మంచిది[illegible]చు







శాతం వరకు మాత్రమే శక్తిని అందించగలుగుతున్నాయి అంటే మనం తీసుకుంటున్న క్రొవ్వు పదార్థాలు మోతాదు చాల తక్కువన్నమాట! సగటు భారతీయుడు రోజుకి 14 20 గ్రాముల క్రొవ్వు పదార్థాన్ని స్వీకరిస్తూ ఉంటే పశ్చిమదేశాలకి చెందిన పురజనుడు 70 150 గ్రాముల క్రొవ్వు పదార్థాన్ని భుజిస్తున్నాడు పయిగా మనం ఎక్కువ శాకీయతైలాలను పుచ్చుకుంటుంటే వారు జంతువులనుండి సంగ్రహించిన క్రొవ్వు పదార్థాలను ఎక్కువగా వాడుతున్నారు శాకీయతైలాలు పూర్తిగా సంతృప్తం చెంది ఉండవు కాబట్టి తేలికగానే జీర్ణమవుతాయి అదే జంతు సంబంధమైన క్రొవ్వు పదార్థాలయితే వెన్న నెయ్యి మీగడ పాలు మాంసం మొదలయినవి పూర్తిగా సంతృప్తం చెంది ఉంటాయి కాబట్టి తేలికగా జీర్ణం కావడం కష్టం క్రొవ్వుపదార్థాలు ఎక్కువగా తీసుకునే వారికి రక్తంలో కొలెస్టరాల్ శాతం ఎక్కువై హృద్రోగాలకు దారితీస్తుందని ఎన్నో పరిశీలనలు స్పష్టం చేస్తున్నాయి డా డేనియల్ బ్రన్నెర్ అనే ఇజ్రాయిల్‌నిపుణుడు రక్తంలో ఉండవలసిన సంక్రమిస్తున్నాయి కానీ క్రొవ్వు పదార్థాలు అధికంగా సేవించడం వల్ల మాత్రం కాదని డా బి కె గోయల్ డా అశ్విన్‌మెహతా అంటున్నారు ట్రైగ్లిసరైడ్స్ ఎక్కువగా రక్తంలో ఉన్నా హృద్రోగానికి దారితీస్తుందని డా జాన్ యుడ్‌కిన్ అనే అమెరికన్ వైద్యుడు చెప్పిన మాటను కూడా ఇక్కడ గుర్తు చేసుకోవడం మంచిది

సంతృప్తం చెందిన క్రొవ్వు పదార్థాలనూ పాలిష్ చేసిన ఆహారధాన్యాలను ముఖ్యంగా పప్పుదినుసులను అధికంగా తీసుకోవడం వల్ల కాన్సర్ వచ్చే అవకాశం ఉందని యు ఎస్ ఏ లోని కాన్సర్ సంస్థ ప్రకటిస్తోంది అమెరికన్ వనితల్లో అన్యా వనితల్లో కన్నా రొమ్ము కాన్సర్ ఎక్కువగా ఉండడానికి ఇదే కారణం! ఇకపోతే అమెరికన్‌లలో యూరోపియన్‌లలో చిన్నప్రేవులకు సంబంధించిన, కాన్సర్ జలుబు జ్వరంలాగా అతి సామాన్యమైపోయింది ఎక్కువగా ఉప్పు తినడంవల్ల పులుపూ కారం వాడడం వల్ల జఠరకోశానికి కాన్సర్ సోకగల ప్రమాదం ఎంతైనా ఉందని బ్రిటిష్ పరిశోధకులు రిచర్డ్ బ్రిస్టో రిచర్డ్ పదార్థాలు ఎక్కువగా ఉండే గోధుమ పచ్చి బఠానీలు కారట్‌లు పచ్చికొబ్బరి ఖర్జూరాలు బాదంపప్పు తరచూ స్వీకరిస్తూ ఉంటే మలబద్ధకం నిరోధించబడుతుంది పయిగా రక్తం కూడా శుద్ధి చేయబడుతుంది అంతేకాదు అపెండిసైటిస్ హెర్నియా వంటి జబ్బులు రాకుండా ఉంటాయి ముతక ధాన్యాన్ని అధికంగా స్వీకరించే ఆఫ్రికన్‌లలో చిన్న ప్రేవులకి సంబంధించిన కాన్సర్ లేశమాత్రం కూడా లేదని యు ఎస్ ఏ కి చెందిన నేషనల్ రిసెర్చి కవున్సిల్ సభ్యుడు ప్రొఫెసర్ డెన్నిస్ బర్‌కిట్ వెలునరించిన అంశం పీచు పదార్థాన్నికున్న ప్రాముఖ్యాన్ని వెల్లడి చేస్తుంది

మనం స్వీకరించే ఆహారమే మన భవితవ్యాన్ని నిర్ణయిస్తుంది మన భవితవ్యమే జాతి ప్రగతిని నిర్దేశిస్తుంది అందుకనే పోషకాహారం ప్రతి మనిషి విధిగా స్వీకరించాలి అందుకోసం వనరులన్నింటినీ సమకూర్చుకొని పరిశ్రమించక తప్పదు

— డా జి ఆర్ బి

# బూస్ట్

## రుచికరమైన శక్తి నిచ్చే పానీయం. రోజంతా అతను చురుగ్గా ఉండేందుకు.



ఈనాడు గెంతుతు ఎగురుతు హుషారుగా పెరుగుతున్న పిలల తరంలో మీ బిడ్డ కూడా ఒకరు అతను ఎప్పుడు కూడా రేకెట్‌తో అడదామా లేకె బంతిని తన్నుదామా, కొత్త కొత్త ఆటలు ఆడదామా అన్న ఆత్రుతతో ఉంటాడు.

స్కూలులో ఎంతగానో కష్టపడతాడు. అన్నింటి గురించి తెలుసుకోవాలన్న తన చురుకైన బుద్ధికి సంతృప్తి కలిగించేందుకు ఎక్కువగా చదువుతాడు. లెఖ్ఖలు చేయడం కష్టమే అయినా, అందువల్ల అతనికి మానసిక ఆనందం ఉంటుంది. అవును, ఈ రోజుల్లో మీ అబ్బాయిది ఉరకలు పరుగులు వేయవలసిన జీవితమే. అతను సూపర్ ఫాస్ట్ రైలులా చకచకా అన్నీ చేసుకుంటూ ముందుకు సాగిపోతాడు.

**బూస్ట్—చాకొలెట్ రుచికరమైన శక్తి.**

మీ బిడ్డకు, రోజంతా పనులు జరిగిపోవడానికి శక్తి అవసరం. బూస్ట్, పాలు, బంగారం రంగు గోధుమ, మాల్టెడ్ బార్లీ, కోకో వంటి శక్తి నిచ్చే పదార్థాలతో తయారైన రుచికరమైన పానీయం.

పాలల్లో కలుపుకొని త్రాగితే చాలా రుచిగా ఉండే బూస్ట్ మీ బిడ్డ రోజంతా చకచకా సాగిపోవడానికి కావలసిన శక్తి నిచ్చేందుకు, పతి ఉదయం ఫలహారంతోబాటు త్రాగించేందుకు అదర్శప్రాయమైన పానీయం.




# బూస్ట్

చురుకైన జీవనానికి శక్తి నిచ్చే ఇంధనం.

# కాల్ గర్ల్

దూరి వెంకటరావు



అది ఫైవ్ స్టార్ హోటల్.

పట్నానికి నడి బొడ్డున ఉండటంవల్ల ఆ నగరాని కంతటికీ ఎంతో శోభను చేకూరుస్తోంది.

రాత్రిళ్ళు రంగు రంగుల విద్యుద్దీపాలతో ఇంద్ర భవనంలా మెరిసిపోతూ వుంటుంది.

అందులో మూడు విభాగాలున్నాయి.

కేబరే సర్కిల్లో రాత్రి తొమ్మిది నుండి పన్నెండు గంటల వరకు ప్రఖ్యాత ఇంటర్ నేషనల్ ఆర్టిస్టుల కేబరే నృత్యాలుంటాయి.

ప్రతి రేయి కొన్ని వందలమంది ఆ డాన్సులు చూసి పరవశిస్తూ వుంటారు.

రెండవది రెస్టారెంట్ దాంట్లో వెస్ట్రన్ టైప్ ఆఫ్ ఫుడ్ లభించడం దాని ప్రత్యేకత.

ఇక మూడవది లాడ్జింగ్. సుమారు ఐదు వందల రూములుంటాయి ప్రతి గది ఎయిర్ కండిషన్డ్ అన్ని రూములలో ఫోమ్ బెడ్, ఫోను, డ్రెస్సింగ్ టేబిలు, సోఫా సెట్టు, పైప్డ్ మ్యూజిక్ మరెన్నో ఖరీదైన కష్టమర్సుకు కావలసిన సదుపాయాలన్నీ వున్నాయి.

రాత్రి పది అవుతోంది

రూములో వంటరిగా వున్న రవికేమి తోచక పోవడంతో కేబరే సర్కిల్లో కొచ్చి కూర్చున్నాడు.

ఒక అందమైన వనిత కేబరే నృత్యమనే పేరుతో అంగ విన్యాసం చేస్తూ తన వంపు సొంపులను బహిర్గతం చేస్తూ మత్తులో కైపెక్కిన మగవాళ్ళందరి మనసులు దోచుకొంటోంది.

రవి కూర్చున్న టేబిలు దగ్గర కొచ్చి, మేను కార్డు చేతికిచ్చి వినయంగా నిలబడ్డాడు సప్లయర్

"ఒన్లీ బీర్ దట్సాల్" ఆర్డరిచ్చాడు రవి

క్షణంలో కోల్డుబీరు సిద్ధమైంది. దాంతో పాటు ఒక ప్లేటు గ్రీన్ బఠాణీ, చిప్స్ కూడా పట్టుకొచ్చాడు.

బాటిలు వోపెన్ చేయడంతో నే నురగలు క్రక్కడం ప్రారంభించింది. దానిని గ్లాసులోకి వంచి వెళ్ళిపోయాడు సప్లయర్

బీర్ సిప్ చేస్తూ కేబరే నృత్యాన్ని తిలకిస్తున్నాడు రవి, మరింత హుషారుగా.

మరింత దగ్గర్లో తన అందాన్ని, ఏ ఆచ్ఛాదన లేని తన శరీరాన్ని అందరికీ అందివ్వాలనే వుద్దేశంతో కాబోలు ప్రతి బల్ల దగ్గరకి వచ్చింది కేబరే నర్తకి షీలా.

ఆమె వంపు సొంపుల్ని చూస్తున్న రవికి మరేదో కావాలనిపించింది.

అదుపు తప్పుతున్న మనసును నిగ్రహించుకొని బిల్ చెల్లించి రూములో కొచ్చాడు చిరాగ్గా లైటార్పి బెడ్‌మీద పడుకున్నాడు. కాని నిద్ర రావడం లేదు. ఏవేవో కోరికలు కుమ్మరి పురుగులా అతని మనసును తొలిచేస్తున్నాయి.

పక్క మీద అటూ ఇటూ దొర్లి మరి పడుకో బుద్ధిగాక, లేచి కూర్చుని కాలింగ్ బెల్ నొక్కాడు.

"సార్" తలుపు తోసుకుని లోపల కొచ్చాడు బోయ్.

"ఏం చేస్తున్నావోయ్"

"మీలాంటి వాళ్ళకు కావలసిన ఏర్పాట్లు చేస్తున్నాను సార్".

"బిజీయా"?

"ఆల్వేజ్ బిజీ బిజీ.... ఫరవాలేదు ఆర్డరివ్వండి"

"రూమ్‌లో ఏంతోచడం లేదోయ్".

"టైమ్ పాస్ కోసం పిట్టని పంపమంటారా"?

"ఊఁ రేటెంతైనా ఫరవాలేదు క్లాస్‌గా వుండాలి సుమా"

"మీకాడౌటక్కర్లేదు"

"వెరీ గుడ్"

వెళ్ళిపోయాడు బోయ్.

ట్రిబుల్ ఫైవ్ సిగరెట్టు వెలిగించుకుని రింగు రింగుల్లా పొగ వదుల్తూ టూ ఇన్ వన్ ఆన్ చేసాడు రవి.

'ఐయామ్ ఎ డిస్కో డాన్సర్' మ్యూజిక్ రావడంతో దానికి లయబద్ధంగా స్టెప్స్ వేయసాగాడు.

అంతలో ఓ స్త్రీ మూర్తి తలుపు తోసుకుని లోనికి రావడంతో టేప్ ఆఫ్ చేసి ఆమె వంక చూసాడు. అంతే, షాక్ తిన్నట్లయి పోయాడు.

ఎర్రటి ముద్ద మందారం లాంటి శరీరం, పెద్ద పెద్ద కళ్ళు, వంకలు తిరిగిన నల్లటి జుట్టు, గుండ్రటి ముఖం, దొండపండులా వున్న ఎర్రటి పెదవులు, ఎత్తైన వక్షస్థలం, దానిపై అస్తవ్యస్తంగా వున్న సన్నని గొలుసు, గోల్డుస్పాట్ రంగు పాలిస్టరు చీర, అదే రంగు బ్లౌజు, నుదుట మ్యాచింగ్ బొట్టు, చేతులకు మ్యాచింగ్ గాజులు.... చూపరులకామె ఒక అందమైన దంతపు బొమ్మేమో ననిపిస్తుంది.

తల వంచుకుని నిలబడిందామె

కొన్ని క్షణాలు రవి నోటి నుండి మాటలు లేవు అతడి హృదయ కడలిలో ఉవ్వెత్తున తరంగాలు రేగి అంతులేని సంచలనాన్ని కలిగిస్తున్నాయి

కొంత సేపయ్యాకా "సరోజా!..... నువ్వు..." అన్నాడు ఆశ్చర్యం నుండి తేరుకుంటూ.

"కాదు రోజీని" అందామె ముక్తసరిగా

"పేరు మార్చుకున్నంత మాత్రాన నిన్ను గుర్తు పట్టలేననుకున్నావా"? మరింత నిర్ఘాంత పోతూ అన్నాడు రవి

"నా పేరు 'రోజీ' అని చెప్పాను. పేరు మార్చి పిలవడం సభ్యత అనిపించుకోదు" అందామె ముఖం పైకెత్తి

ఆమె కళ్ళల్లో కళ్ళుంచి సూటిగా చూడలేక పోతున్నాడు రవి.

"ఏమిటా మాటలు సరూ, ఆ 'రోజు నన్ను కాదని వూరు విడిచి పెట్టి వెళ్ళి పోయిందెందుకా"? అడిగాడు ఆమె చుబుకాన్ని పైకెత్తుతూ.

అతని మాటలకామె ఏమాత్రం చలించలేదు

"గతాన్ని త్రవ్వకు నే నిప్పుడు కాల్ గర్ల్‌ని. నువ్వీ హోటెల్ కస్టమరువి. మనిద్దరి మధ్యా అంతే సంబంధం" అన్నదామె అతడి చేతిని ప్రక్కకు విదిలిస్తూ

విస్తుపోయాడు రవి

వారి సంభాషణను వింతగా వింటున్న బోయ్‌ని వెళ్ళి పొమ్మన మని చెప్పి "కూర్చో" అన్నాడు సోఫా చూపిస్తూ

మరబొమ్మలా చతికిల బడిందామె.

రవి సిగరెట్టు కేసులోంచి సిగరెట్ తీసి వెలిగించుకుంటూ, "ఒక్క మాట చెప్పు సరూ!... నువ్వెందుకిలా మారిపోయావు" అన్నాడు

ఎంతో ప్రాధేయ పూర్వకంగా వున్నాయి అతడి మాటలు. ఆమెను గూర్చి తెలుసుకోవాలని ఉబలాట పడుతోందతని మనసు

"హు మారే దెవరు? మార్చే దెవరు"? ఎంతో విరక్తిగా వున్నాయి ఆమె మాటలు.



అది కాదు సరూ'   ఏదో అనబోయాడు రవి

అనవసరంగా కాలయాపన చేయకు అర్థం లేని ప్రశ్నలు వేసి నన్ను విసిగించకు డోంట్ వేస్ట్ మై టైమ్ అన్నదామె లేచి తలుపు గడియ వేస్తూ

ఇప్పుడామె ప్రవర్తనకి ఆశ్చర్యంతో పాటు అసహ్యం కూడా వేసిందతనికి

ఎంత బరితెగించి బతుకుతున్నావే! నీ మనస్తత్వం ఇలాంటిదని నీ అభిరుచి ఇంత చవక బారుదని తెలుసుంటే ఆ నాడు నిన్ను కన్నెత్తి చూసేవాణ్ణి కాదు నీ అసలు స్వరూప మిదన్న మాట

అంత వరకు సాత్వికంగా వున్న ఆమె కోడెత్రాచులా లేచింది

మిష్టర్ రవి గివ్ రెస్పెక్ట్ అండ్ టేక్ రెస్పెక్ట్ పాత పరిచయాన్ని పురస్కరించుకుని అతిగా మాట్లాడకు నువ్వు ఎమన్నా పడటానికి నేను ఆ నాటి సరోజను కాదిప్పుడు అంది కోపంగా

ఆమె మాటలకు చిన్నగా నవ్వుకున్నాడు రవి

ఆ నవ్వుకు ఆమె వంటిమీద తేళ్ళూ జెర్రులూ ప్రాకుతున్నట్లనిపించింది అక్కడ వుండటమే ఎంతో ఇబ్బందన్నట్లున్నాయి ఆమె చూపులు వచ్చిన వెంటనే వెళ్ళిపోక ఇంత వరకూ ఎందుకున్నానా! అని అనిపించిందామెకు

నువ్వెళ్ళి పోతే దేవదాసులా మారిపోతానను కున్నావు కదూ! అలాంటి పిచ్చిపనేమి కాది రవి నువ్వు వెళ్ళిపోయిన వెంటనే పెళ్ళి చేసుకున్నాను మంచి ఉద్యోగం కూడా అయింది అన్నాడు గర్వంగా

కాని నువ్వు ఇప్పుడు చేస్తున్న పని

నోర్ముయ్ నేను మగవాణ్ణి నే నెలా నడిచినా ఈ సంఘంలో ఆక్షేపణ వుండదు

ఆ మాటల కామె మరింత రెచ్చి పోయింది

రవీ! ఇట్ ఈజ్ టూమచ్ ఫస్ట్ కంట్రోల్ యువర్ టంగ్ ప్రవర్తన విషయానికి వస్తే ఆడైనా మగైనా వొక్కటే మగవాడివి కదా అని ఇదే పని మీ వూళ్ళో మీ ఇంట్లో చేయగలవా? లేదు అక్కడ నీకో స్టేటస్ కావాలి గౌరవం కావాలి పెద్దమనిషి లాగ చలామణీ అవ్వాలి అందుకే ఈ ప్రక్కదారులు నువ్వు ఇక్కడ చేసే పని నీ భార్యకు తెలుసా? తెలుస్తే ఆమెంత చిత్రవధకు గురౌతుందో వూహించావా? ఆత్మ వంచన చేసుకోడానికి కాకపోతే మరెందుకీ మాటలు

కోపంలో ఆమె కళ్ళు నిప్పులు కక్కుతున్నట్లున్నాయి ఆమెకు గతం గుర్తుకి రాసాగింది అంతలోనే మళ్ళీ వర్తమానం లోకి తొంగి చూసింది ఎంతో కాలం తర్వాత విడిపోయిన ప్రేయసీ ప్రియులు కలుసుకున్నప్పుడు మాట్లాడుకునే దోరణి ఇదేనా? అనుకుంది ఆ సమయంలో ఆమెకు నవ్వాలో బాదపడాలో తెలీటం లేదు వెంటనే వెళ్ళి పోవాలని నిర్ణయించుకుంది

జీవితంలో మొట్టమొదటి సారిగా నిన్ను ప్రేమించినందుకు ఇప్పుడు బాదపడు తున్నాను అన్నాడు రవి సిగరెట్టు పొగ గట్టిగా లాగి వదులూ

అతడి మాటలకామె పేలవంగా నవ్వి నువ్వు నన్ను ప్రేమించావా? అసలు ప్రేమకు నిర్వచనం చెప్పగలవా? ఇంతెందుకు నీ ప్రేమే నిజమైతే నువ్వు మరొకరిని వివాహం చేసుకోగలవా? నువ్విలాంటి వాడి వని ముందే తెలిస్తే నే నసలు నీకు హృదయ మర్పించే దాన్నేకాదు

ఇప్పుడర్పిస్తున్నావుగా రోజుకొకళ్ళకి అన్నాడు రవి యగతాళిగా

ఆ మాటల కామె సహనం కోల్పోయింది స్టాప్ ఇట్ మరో ముక్కంటే సహించేది లేదు నే నిప్పుడు నీకు కావాలో అఖ్ఖర్లేదో చెప్పు నా కవతల చాలా ఎంగేజిమెంట్సున్నాయి నేనింతవరకు నీ గదిలో వున్నానంటే దానిక్కారణం ఈ హోటల్ నియమాలను అతిక్రమించ లేకేనని గుర్తుంచుకో కోపంలో వున్న ఆమె లేచి నిలబడగానే అపర కాళీమాతలా కనిపించింది రవికి

ఓహ్ ఈ ఒక్క విషయంలో మాత్రం నిన్ను అబినందించక తప్పదు నమ్ముకున్న సంస్థమీద చేపట్టిన వృత్తిమీద నీకు గల ప్రేమాభిమానాలకు నా జోహార్లు అన్నాడు వెక్కిరింపుగా

అతడంటున్న ఒక్కొక్క మాట సరోజ గుండెల్లో ఈటిల్లా గ్రుచ్చుకొంటున్నాయి ఒక్కసారి మ్రింగేద్దామా అన్నంత కోపంగా రవి వంక చూసింది

కన్న తండ్రిని పొట్టన బెట్టుకుని రక్తం పంచుకు పుట్టిన తమ్ముణ్ణి జులాయిగా తయారు చేసి విలాసాలు సాగిస్తున్న నువ్వు మరింత రెచ్చగొడుతూ వికటంగా నవ్వాడు రవి

మరో క్షణం కూడా అక్కడ వుండ బుద్ధి కాలేదామెకు అతనితో పోట్లాట అవివేకమనుకుంది

బోయ్ సరోజ ఎలుపుకు మేడమ్ అంటూ లోపల కొచ్చాడు హోటల్ బోయ్

ఇతనికి నా అవసరం వుందో లేదో కనుక్కో!

సార్

వెళ్ళమను

గుడ్ బై నాకు రావలసిన డబ్బు

దేనికి?

నన్ను పిలిపించి నందుకు!

నే నామెతో వుండలేదుగా బోయ్ నుద్దేసిస్తూ ఆశ్చర్యంగా అన్నాడు రవి

మీ రామెను బుక్ చేసి నందు కివ్వాలి సార్!

సరే ఎంతో చెప్పు!

వంద అంది కటువుగా

ఇంద

హు  డబ్బు తీసుకుని విసురుగా వెళ్ళిపోయింది సరోజ

మతిపోయి నట్లైంది రవికి

రహదారిలో పోయే జీవిత రథాన్ని కావాలని ముళ్ళ కంచెల్లోకి ఎందుకు మళ్ళించిందో ఎంత ఆలోచించినా అతడికి అంతు బట్టడం లేదు

బోయ్! బిగ్గరగా కేక వేసాడు ఆ అరుపుకు పరుగున వచ్చాడు కుర్రాడు

రూము ఖాళీ చేస్తున్నా చిరాగ్గా వున్నాయి అతడి మాటలు

అప్పుడే వెళ్ళి పోవడమా? నాలుగు రోజులుంటామన్నారు ఎంతో అభిమాన మొలుకుతున్నట్లన్నాడు బోయ్

ఉండ బుద్ధి కావడం లేదు అందుకే ఈ రాత్రి ట్రైనుకే వెళ్ళి పోదామను కొంటున్నాను

సరే మీ ఇష్టం మరి నా టిప్  బుర్ర గోక్కుంటూ అన్నాడు బోయ్

ఆమెకు వందివ్వగా లేంది నీకో పదిస్తే తప్పా తీసుకో జేబులోంచి డబ్బులు తీసిచ్చాడు రవి

థాంక్యు సార్ థాంక్యు అంటూ అతని బ్రీఫ్ కేస్ నందుకున్నాడు

అతడి అవస్థను గమనించిన బోయ్‌కి నవ్వొస్తోంది డబ్బున్నోళ్ళందరకూ ఇదో జబ్బు ఆకలి అంటూ కడుపు చేత బట్టుకుని అడుక్కుంటున్న వాడికి ధర్మం చేయడానికి చేతులు రావు మందుకూ మగువకూ ఎంతైనా కనకవర్షం కురిపిస్తారు అనుకున్నాడు తనలో తను

## 2

డిక్కీలో సూట్‌కేస్ వుంచుతూ ఎక్కడికి పోవాలిసార్ అడిగాడు టాక్సీ డ్రైవరు

మధుకి ఆ వూరు క్రొత్త మొదట ఎటు వెళ్ళాలో నిర్ణయించుకోలేక తటపటాయించాడు

ఏదైనా మంచి హోటల్‌కి పోనీ అన్నాడు వామనరావు బేక్ డోర్ తెరుస్తూ

నేనొచ్చింది ఆఫీసు పనిమీద హోటల్‌కి దేనికి? అడిగాడు మధు

నువ్వీవేళప్పుడు ఆఫీసు కెళ్ళినా ఎవరూ ఉండరు ఈ రాత్రికి ఎక్కడైనా బస చేసి రేపు ఉదయం వెళ్ళొచ్చు అన్నాడు వామనరావు

సరే నన్నాడు మధు

టాక్సీ వేగాన్ని పుంజుకుంది సమయం సాయంత్రం ఆరు గంటలు డిసెంబరు నెల కావడం వల్ల అప్పుడే చీకటి పొరలు అలుముకో సాగాయి కిటికీల నుండి వస్తున్న చలి గాలి ఎముకల్ని కొరికేస్తున్నట్లుంది

గట్టిగా మఫ్లర్ చుట్టుకుని అవతలకు చూసాడు మధు. మెర్క్యూరి లైట్ల కాంతిలో నగర మెంతో శోభాయమానంగా ఉంది. కన్నుల పండుగలా వున్న ఆ నగర వైభవాన్ని కళ్ళు తిలకిస్తున్నా మెదడు మాత్రం ఏమేమో ఆలోచిస్తోంది. ఆఫీసరు ఆదేశాన్ని ధిక్కరించలేక ఆ వూరు వచ్చాడే కాని తనకి ప్రయాణం బొత్తిగా ఇష్టం లేదు. పుట్టి పెరిగింది చిన్న టౌనులో. చదువు పూర్తవుతూనే ఆ వూళ్ళోనే వున్న ఒక ప్రైవేటు కంపెనీలో పెర్సనల్ అసిస్టెంట్‌గా వుద్యోగమయింది. మహానగరాలలో ఎలాగ మసలుకోవాలో తనకు బొత్తిగా తెలీదు. ఐతే తన మిత్రుడు వామనరావు కూడా తనతో ఆ వూరు వస్తానని అనడంతో కాస్త ధైర్యం చేసి ఇల్లు కదిలాడు

టాక్సీ ఫైవ్‌స్టార్ హోటల్ ముందు ఆగింది. ఏడంతస్థుల ఆ లాడ్జింగ్ అండ్ రెస్టారెంట్ వివిధ వర్ణముల విద్యుద్దీపాలతో ధగ ధగ మెరిసి పోతోంది.

డ్రైవరుకు డబ్బులిచ్చి రిసెప్షన్‌లో కడుగు పెట్టారు

"వాట్ కెన్ ఐ డూ ఫర్ యు?" అడిగాడు మానేజరు ఎంతో స్మార్ట్‌గా.

"వుయ్ వాంట్ ఎ డబుల్ రూమ్" అన్నాడు వామనరావు.

"బోయ్, వీరికి ఫోర్త్ ఫ్లోర్ రూము నెంబరు సెవెన్ చూపించు" కీస్ ఇస్తూ హుందాగా ఆజ్ఞాపించాడు మానేజరు.

బుక్‌లో సైన్ చేసి బోయ్ ననుసరించారు.

తాళం తీసి రూము చూపించాడు బోయ్

ఎయిర్ కండిషన్డ్ చేయబడ్డ ఆ గది అత్యంత ఆధునికంగా వుంది. సకల సౌకర్యాలతో విరాజిల్లుతున్న ఆ రూమును పరికిస్తూ సోఫాలో చతికిల బడ్డాడు మధు.

"నువ్వు మరేమి చూడనక్కర్లేదు ఇట్ ఈజ్ టాప్ ఇన్ టౌన్. బెస్ట్ ఇన్ సిటీ. వండర్ ఇన్ సెవెన్ వండర్స్" తెగ పొగిడేస్తున్నాడు వామనరావు

"ఐ. సీ" అన్నాడు మధు కాస్త రిలాక్సై.

"అంతేకాదు మనం కోరుకున్న వన్నీ క్షణాల మీద సప్లై చేయడం ఈ హోటల్ స్పెషాలిటీ "

"అఫ్‌కోర్స్. ఇట్ ఈజ్ నేచురల్ ఇన్ బిగ్ హోటల్స్." సోఫాలోంచి లేచి కోటు విప్పి స్టాండుకు తగిలించాడు మధు.

"ఏం కావాలో ఆర్డరివ్వండిసార్" అడిగాడు బోయ్.

"ఉండవోయ్ తొందరెందుకు మా వాణ్ణి కాస్త వూపిరి పీల్చుకోని వందమైళ్ళు ప్రయాణం చేసొచ్చాడు" నవ్వుతూ అన్నాడు వామనరావు. అతనికిదివరకు ఆ హోటల్‌తో కాస్త పరిచయముంది.

"ఓ. కే" వెను తిరిగి వెళ్ళిపోబోయి మధు కేకతో మళ్ళీ లోనికి అడుగు పెట్టాడు బోయ్.

"ఈ పూట మా ఇద్దరికీ క్యారేజి పంపు. రెస్టారెంటుకు వెళ్ళే వోపిక లేదు "

"మరేం వద్దాసార్?"

"ఇంకేం కావాలి?" సాలోచనగా తనలో తనే అనుకున్నాడు మధు.

"అదేరా ఈ రాత్రికి "కంపెనీ" అంటే మన భాషలో తోడు '

అర్థంగాక అయోమయంగా చూసాడు మధు

"మీరుండండి సార్, నేను చెబుతాను "

"నువ్వు చెప్పే దేమిటోయ్ బోడి నేను చెప్పినట్లు చెయ్యి" గద్దించాడు మధు.

"అది కాదు సార్! కాలాక్షేపానికి కాల్‌గర్ల్స్ నెవరినైనా . ."

"కాల్ గర్ల్సా?"

"ఊఁ.. ."

"ఈ హోటల్‌లో కాల్‌గర్ల్స్ వుంటారా?" అమాయకంగా వుంది మధు ప్రశ్న

"అదేం ప్రశ్నరా!" అన్నాడు వామనరావు.

"ఇక్కడుండరు సార్. ఫోన్ చేసి రప్పిస్తాం "

"మీ హోటల్‌లో దిగిన కష్టమర్లు కాల్‌గర్ల్స్‌ని కోరుకుంటారా?"

అతని అమాయకత్వానికి బోయ్ చిరునవ్వు నవ్వుతూ, "ఈ హోటల్‌లో ఎంతో మంది లక్షాధికారులు దిగుతూ వుంటారు. వాళ్ళ అవసరాలకు, ఆనందం కొసం లేడీస్‌ని కావాలంటారు బ్రతుకు తెరువు కొసం కొందరాడవాళ్ళు ఇటువంటి హోటల్స్‌తో సంబంధం పెట్టుకుంటారు వాళ్ళనే "కాల్‌గర్ల్స్" అంటాము. మేము కబురు పెట్టిన మరుక్షణం మీ ముందొచ్చి వాలతారు."

"అంటే పెద్ద పెద్ద హోటల్స్‌లో కూడా వ్యభిచారం విశృంఖలంగా సాగుతోందన్న మాట "

"దానిని వ్యభిచారం అనరురా బ్రదర్! సివిలిజేషన్ అంటే నాగరికత అన్న మాట. దీనికి వీళ్ళకు లైసెన్సు కూడా వుంటుంది" సర్వం తెలిసినట్లుగా అన్నాడు వామనరావు నవ్వుతూ.

"కాలేజీలో చదూకునేటప్పుడు "కాల్‌గర్ల్స్" అన్న పదం విన్నాను అంతకు మించి వాళ్ళ గురించి నాకు తెలీదు."

"సరే, తెలుసు కొందువు గానిలే, పంపించమని చెప్పు" తొందర పెట్టాడు వామనరావు.

"పంపించు" అన్నాడు మధు యధాలాపంగా బోయ్‌నుద్దేశిస్తూ

వెంటనే టేబిలు సొరుగులోంచి ఒక ఆల్బం తీసి అతని ముందుకు విసిరి "సెలక్టు చేసుకోండి" అన్నాడు బోయ్

ఆశ్చర్యంగా చూశాడు మధు.

"నీకు నచ్చిన అమ్మాయిని" అన్నాడు వామనరావు.

అప్రయత్నంగా పేజీలు తిప్పాడు మధు.

తమ శరీర వంపు సొంపులను ప్రదర్శిస్తూ అందమైన యువతులెందరో కనిపించారందులో

మధు చేతిలో వున్న ఆల్బంలోని నాలుగైదు ఫొటోలు చూసాకా, "బోయ్! వీళ్లెవరూ కాదుగాని, ఈ మధ్య 'సరోజ' అనే అమ్మాయి ఈ ప్రొఫెషనులో దిగిందని విన్నాను ఆమెగాని మీ లిస్టులో వుందా?" ఎంతో ఆదుర్దాగా అడిగాడు వామనరావు.

"సరోజా! అలాంటి పేరుగల వ్యక్తి మాకింకా తారసపడలేదు సార్ ఐనా ఆ అమ్మాయిని గురించి అంత పర్టిక్యులర్‌గా అడుగుతున్నారు చాలా బావుంటుందా?"

"ఎక్సలెంట్, వెరి ఫైన్ ఒకప్పుడు మా ఆఫీసులోనే టైపిస్టుగా పని చేసేది. భలే తల బిరుసులే అందుకే జీవితంలో మంచి గుణపాఠం నేర్చుకుంది ఏది ఏమైనా ఆడదానికంత అహంకారం పనికిరాదు. ఈ మధ్య గత్యంతరం లేక "కాల్‌గర్ల్"గా మారి ఈ వూళ్లోనే వుంటున్నట్లు తెలిసింది "

వామనరావు మాటలకేదో గుర్తొచ్చిన వాడిలా, "మీరనేది రోజిని గురించి కాదు కదా. ఆమెగాని మీరనుకున్న అమ్మాయైతే ఈ ఆల్బం చివరి పేజీలో వుంది" అంటూ పేజీ త్రిప్పి వామనరావుకు చూపించాడు బోయ్.

బోయ్ చూపించిన ఫొటో వంక చూసి ఆనందం పట్టలేక, "యస్ ఎగ్జాట్లీ కరక్ట్... ఈ అమ్మాయే" అన్నాడు వామనరావు.

"నీకా అమ్మాయి తెలుసా?" అడిగాడు మధు ఆశ్చర్యంగా.

"తెలుసునా అని అంటావేమిటి? మా ఆఫీసులోనే పని చేసేదని చెప్పాను

# ధనవినియోగం

ధర్మపథం



ధనం ఒక చోట మూలుగుతూ ఉంటే దానికి ప్రయోజనం ఉండదు. కావలసిన పనులకు దానిని వినియోగించినప్పుడే దానికి విలువ ఉంటుంది. డబ్బును ఖర్చు పెట్టకుండా కూడ బెట్టువానిని లోభి అంటారు. లోభి ధనాన్ని ఉపయోగించి తాను సుఖ పడడు. ఇతరులకు ఇవ్వడు. ఇతనిని అందరూ నిందిస్తారు. తనకు ఉన్న దానితో తాను సుఖపడుతూ, ఇతరులకు ఇచ్చే వ్యక్తిని అందరూ ప్రశంసిస్తారు.

ధనం ఉన్నప్పుడు దాన్ని వినియోగించడం అవసరమే. అయినా, ఆ ధనం ఖర్చు పెట్టేటప్పుడూ గమనించవలసిన విషయా లెన్నో ఉన్నవి. చేతిలో పుష్కలంగా ధనం ఉన్నప్పుడు ముందు వెనక లాలోచించకుండా విలాసాల కోసం, వినోదాల కోసం విపరీతంగా వ్యయం చేసి, ఆ తర్వాత డబ్బు కోసం చిక్కు పడేవారు ఉన్నారు. అప్పుడు వారు తమ అలవాట్లను మానుకోలేక వాటి కోసం అప్పులలో చిక్కుకో వలసి వస్తుంది. కొందరు ముఖస్తుతులకు లొంగిపోయి పై వారికి దానం చెయ్యడమూ, అపాత్ర దానం చెయ్యడమూ జరుగు తున్నది. అపాత్రుడికి ధన సహాయం చేస్తే, వాని అయోగ్యతకు ప్రోత్సాహ మిచ్చినట్లే అవుతుంది. అందువల్ల బాగా పరిశీలించిన తర్వాతనే సహాయం చెయ్యాలి.

బాగా ధనం ఉన్నవారు వ్యర్థంగా దానిని వినియోగించకుండా పరిశ్రమలను ప్రారంభిస్తే, అది దేశాభివృద్ధికి తోడ్పడుతుంది. చాలా మందికి జీవనోపాధి కూడా లభిస్తుంది. అనాథులకూ, అంగ వైకల్యం కలవారికి ధన సహాయం చేస్తే ప్రజాసేవ చేసినట్లవుతుంది. అనాథ శరణాలయాలకు చేసిన ధన సహాయం మంచి పేరు శాశ్వతంగా నిలిచేటట్లు చేస్తుంది.

ధనం ఉన్నంత మాత్రాన గొప్ప వాడని అనిపించుకోడు. ఆ ధనం సద్వినియోగ మైనప్పుడే అతనికి మంచిపేరు వస్తుంది. దుర్వినియోగం వల్లా అమిత వ్యయం వల్ల కలిగేది చెడ్డపేరు మాత్రమే!

– బులుసు వేంకట రమణయ్య

## కాల్ గర్ల్స్

కదా!అంతే కాదు నా ప్రక్కనే ఆమె సీటు కూడా ఖాళీ దొరికినప్పుడెల్లా ఆ అమ్మాయితో బాతాఖానీ కొట్టేవాణ్ని''

''ఈ అమ్మాయి ఈ ప్రొఫెషనుకు కొత్తసార్ మహాయైతే" నాలుగు వారాలవుతుంది వెరి బ్యూటీఫుల్ లౌలీ. మార్వెలస్ పంపించమంటారా?''

''సరే, పంపించు' అన్నాడు మధు మరేదో ఆలోచిస్తూ

హుషారుగా ఈల వేసుకుంటూ వెళ్ళిపోయాడు బోయ్

వామనరావు ఉత్సాహంగా లేచి సిగరెట్టు వెలిగించుకుని అటు ఇటూ తిరుగుతూ, ''దీని కోసమేరా మధూ నేనింత దూరం నువ్వు పిలవగానే పరుగెత్తుకు వచ్చింది ' అన్నాడు

''నాకు తెలీక అడుగుతాను మీ ఆఫీసులో పని చేసేటప్పుడు కూడా ఆమె క్యారెక్టరింతేనా?''

''అమ్మో, అలా అనకు నిప్పు కరెక్టుగా చెప్పాలంటే పురాణ కాలం నాటి సీతా, సావిత్రి, అనసూయలకు స్వయాన సిస్టరే ఐతే ఏం లాభం? , ఆ తర్వాత చాలా దెబ్బలు తింది'' అన్నాడు వామనరావు

''ఆడవాళ్ళ గురించి నువ్వంత చులకనగా మాట్లాడకురా. అసలామె ఎటువంటి పరిస్థితులలో ఈ వృత్తిని చేపట్టవలసి వచ్చిందో' బాధపడుతున్నట్లుగా అన్నాడు మధు

''తినబోతూ రుచెందుకడుగుతావ్? వస్తోందిగా అన్నీ తెలుస్తాయి అసల నీ మాట ఎలా వున్నా నాకు మాత్రం చాలా క్యూరియాసిటీగా వుందోయ్'' లోలోపల పొంగిపోతూ అన్నాడు వామనరావు

''నాకూ, కాల్‌గర్ల్స్ గురించి తెలుసుకోవాలని ఎప్పటి నుండో వుంది.''

''అలా అని డబ్బులు తగలేసుకుని రాత్రంతా దాని చరిత్ర వింటూ కూర్చొకు'' అంటూ డాన్సు చేయడం మొదలు పెట్టాడు వామనరావు హుషారణచుకోలేక

అతని నృత్యం మధుకి చిరాకనిపించింది. వాడి ఆనందం పాడు చేయడమిష్టంలేక ఏటో ఆలోచిస్తూ సిగరెట్టు వెలిగించుకున్నాడు మధు

(ఇంకా ఉంది)


STAINLESS STEEL
Expresso
WATER FILTER
Expresso
* Expresso gives you two different Water Filters Stainless Steel filters
* Expresso Stainless Steel Water Filters are sturdy they are deep drawn from 24 gauge thick Salem steel
* Expresso Water Filters gives you pure drinking water Filtered through a high porosity ceramic candle
* Expresso Stainless Steel Filters have an extra shine (because of the mirrorfinish) that adds beauty to your decor
* Expresso Stainless Steel Filters don't chip and are free from odour, because they are epoxy painted and
* The name Expresso is the one you can trust We have the widest range of appliances Backed by a network of over 100 dealers For prompt service anywhere in india
That's why Expresso Water Filters are a pure delight!
10 సం॥ గ్యారంటీ
ఒరిస్సా మరియు
ఆంధ్రప్రదేశ్‌కు సోల్ డిస్ట్రిబ్యూటర్స్.
శ్రీ శాంతి స్టీల్ సెంటర్
గుడివాడవారి వీధి విజయవాడ.520001
ఫోన్స్: ఆఫీసు: 62451. 62452. Resi 63430.
సబ్ డిస్ట్రిబ్యూటర్స్
1. సప్తగిరి ఎంటర్‌ప్రైజెస్, సోంపేట. 2. గణేశ్ మెటల్ స్టోర్సు, విజయ నగరం 3 విశ్వనాథ్ స్టీల్ సెంటర్, జైపూర్. 4. రామచంద్ర మెటల్ స్టోర్సు, నర్సన్నపేట 5 సుభోదయ స్టీల్ సెంటర్, జైపూర్ 6 కనక దుర్గేశ్వర స్టీల్ హౌస్, విజయవాడ. 7. సత్యనారాయణ స్టీల్ సెంటర్, విజయవాడ 8 దుర్గ ఎంపోరియం, ఏలూరు
ARUNA

# లింకు

## ఎం. ఉమామహేశ్వరరావు

ఉన్నట్టుండి దమయంతి బిగ్గరగా నవ్వింది నవ్వుతున్న దమయంతిని ఆశ్చర్యంగా చూసేడు సుందరం దమయంతి నవ్వులో సహజత్వం కన్పించ లేదతనికి ఏదో కావాలని తెచ్చి పెట్టుకున్నట్టుగా ఉందా నవ్వు

ఎంతో ఎత్తు నుంచి క్రిందకు దుముకుతున్న జలపాతం హోరు ఒక్కసారి స్థంభించినట్టుగా దమయంతి నవ్వడం ఆపేసింది హఠాత్‌గానే అమె ఎందుకలా నవ్వాల్సి వచ్చిందో, ఏమిటో అర్థంగాక ఆమె వేపే చూసేడు సుందరం

చాలా గొప్పగా జోక్ చేసేవురా అన్నయ్యా!! నీ దగ్గర ఓ అయిదు వేల రూపాయలు లేవంటే చాల ఆశ్చర్యంగా ఉందిరా! తోడబుట్టిన వాడివని నోరు విడిచి నిన్ను అడిగేను లేదంటున్నావు.'

నిందా భరితంగా పలికింది దమయంతి

నిజం చెప్తున్నా తన చెల్లెలు తనను నిందిస్తున్నందుకు బాధని పించింది సుందరానికి తన బాధలు ఆమెకు తెలీక పోవచ్చు ఎవరి బాధలు వారివే అన్నారందుకే .

ఆ మాటే అన్నాడు సుందరం

చూడు దమయంతీ! ఇప్పుడు నా దగ్గర నువ్వడిగినంత డబ్బు లేదుగాక లేదు అపైన నువ్వేమన్నా సరే! అయినా యింతకు ముందు నీకోసారి చెప్పాను మళ్ళీ మరోసారి చెప్తున్నాను

మనవి మధ్య తరగతి జీవితాలు ఉన్నంతలోనే బ్రతకడం నేర్చుకోవాలి మన పిల్లలూ అలానే బ్రతికేటట్టు తయారు చేసుకోవాలి తలకు మించిన బరువు మోయాలని జూస్తే అపైన తిప్పలు తప్పవు పెళ్ళి కెదిగిన నీ కూతుళ్ళకు మంచి కుర్రాళ్ళకిచ్చి పెళ్ళి చేయాలను కోవడం సహజమే కాని తలకు మించిన అప్పులు చేసి వేలకు వేల రూపాయలు కట్నాలు పోయాలని చూస్తే అది మంచిది కాదని నా అబిప్రాయం తన మనస్సులోని మాటను పైకి తేల్చి చెప్పేసేడు సుందరం దెబ్బ తిన్న పక్షిలా చూసింది దమయంతి

తల్లీ తండ్రి పోయేక అన్నీ తానై చదివించి, పెద్దదాన్ని చేసి ఓ అయ్య చేతుల్లో పెట్టిన సుందరం అంటే దమయంతికీ ఎంతో గౌరవమే . కాని ఆ అయ్య ఓ పిల్లలకు పాఠాలు నేర్పే అయ్యవారనీ, నెల నెలా కాదుకదా, రెండు నెలల కొసారైనా సరిగ్గా జీతాలు అందని దురదృష్ట, చిరుద్యోగనీ తెలిసి వచ్చేసర్కి ఆమెకు సుందరం పట్ల ఎక్కడో మనస్సు మారు మూలల్లో ద్వేషం, పగ, రగిలింది గోరుచుట్టు మీద రోకటి పోటులా సుందరం మాత్రం మంచి కట్నం, సారె, చీరెలు, నగలు తెచ్చుకున్న శారదను భార్యగా చేసుకోవడం మరింత అగ్నిలో ఆజ్యం పోసినట్టుందామెకు

అయితే అప్పటికే దమయంతికి ఓ ఇద్దరు కూతుళ్ళు వరుసగా పుట్టేయడం, అసలే దినదినగండం నూరేళ్ళాయుష్షులా వున్న జీవితంలో దుఃఖం స్థానే ఆవేశం, ఆనక అదిపోయి ఆయాసం వచ్చేశాయి దమయంతి భర్త సుబ్బారావు తలపై వెంట్రుకలు నెరశి పోయేయి ఇక ఆ ఇద్దరితో ఆపేసి, సంసారాన్ని పొదుపుగా చూసుకోవడం దమయంతికి అతికష్టంగా తయారైంది అప్పుడప్పుడు చెల్లెలు ఇంటికెళ్తూ, వందో, పాతికో సాయం చేస్తూ, వాళ్ళ సంసారాన్ని వీధిపాలు కాకుండా సుందరం చూసుకొస్తున్నాడు.

దమయంతీ సుబ్బారావుల గుండెలమీద కుంపటిలా చకా చకా పెళ్ళి కెదిగి వచ్చేరా యిద్దరాడపిల్లలున్నూ

పెద్ద పిల్ల విజయ కు ఓ మాంచి సంబందమే తీసుకొచ్చేడు సుందరం. కుర్రాడేదో గవర్న-మెంటాఫీసులో చిరుద్యోగి జీతం నాలుగు వందలు . ఖాయపర్చేద్దామని పించింది సుందరానికి

సుబ్బారావుకూ ఆ సంబంధం ఇష్టపడింది కాని దమయంతికా సంబంధం నచ్చలేదు సుబ్బారావుకు నచ్చినవీ, దమయంతికి నచ్చనివీ చాల వున్నాయి తను అప్పటి వరకూ బ్రతికిన బ్రతుకులో రుచి చూసిన చేదు అనుభవాలు గుర్తుకు తెచ్చుకుంటూ, కనీసం తమ ఆడపిల్లల బ్రతుకులైనా మూడు పూటలా కాకపోయినా, కనీసం రెండు పూటలా కడుపు నిండా తిండికి లోటు రాకుండా చేయాలనే ఓ తల్లిగా దమయంతి తాపత్రయం

. అప్పుచేసి పప్పుకూడెందుకో? అన్న సుబ్బారావుకీ, అప్పు చేసైనా సరే మన పిల్లలు పప్పుకూడు తినేలా చూడటం కన్నందుకు మన బాధ్యత అంటున్న దమయంతికీ మధ్య సుందరం కలుగ చేసుకోక తప్పలేదు అందుకే చెల్లెల్ని హెచ్చరించేడు. అయినా దమయంతికి సుందరం మాటలు రుచించ లేదు

సుందరం కాస్త తగ్గేదప్పటికి

మంచి మంచి ఉద్యోగాలు చేస్తున్న సంబందాలు వచ్చేయి అసలు సమస్య దగ్గర కొచ్చేసర్కి వెనకంజ వేసేశాయి

సంబందాలు వచ్చినప్పుడల్లా, వచ్చిన వాళ్ళకు మర్యాదా, మన్ననా, చేసేందుకే మనం తడుముకుంటూ వుంటే, యిక వేలకొద్దీ రూపాయలు ఎలా తెచ్చి చావమంటావు? ఓసారి సుబ్బారావు భార్యను కోపగించేడు చిరునవ్వే సమాధానంగా బదులు చెప్పింది దమయంతి

ఎలాగయితేనేం ఓ సంబందం తనే వెతికి పట్టుకుంది కుర్రాడు ఏదో ఆఫీసులో పన్జేస్తున్నాడు నెలకు ఆరొందల రూపాయలు తెచ్చుకుంటూ గౌరవంగా బ్రతుకు తున్నాడు ఒకే ఒక చెల్లెలు వుంది, అన్నదమ్ములు ఎవరూ లేరు స్వంత ఇల్లుంది. ఇంకేం గావాలి?

దమయంతీ, సుబ్బారావు లాటి మద్య తరగతి బడుగు జీవులకు అది చాల గొప్ప సంబంధమే!

పిల్ల తప్పకుండా సుఖపడు తుంది కట్నం అయిదు వేల రూపాయలు సారెలకు, చీరలు వగైరాలకు మరో అయిదు వేల రూపాయలు అవుతుందని గర్భిగా నిర్దారించుకుని ఓ అయిదువేలు సంపాదించే బాద్యత తన భర్తపైనా, మరో అయిదు వేలు అప్పుగా నయినా సర్దే బాధ్యత సుందరంపైనా పెట్టేసింది దమయంతి

నావంతు డబ్బును ఎలాగో తంటాలుపడి సంపాదిస్తాను గానీ, ముందు మీ అన్న సుందరాన్ని అయిదువేలూ సర్దమని అడుగు అన్నాడు సుబ్బారావు

సరేనంటూ సుందరం దగ్గిర కొచ్చింది దమయంతి తన మాటల్ని వినలేదని కోపంతో సుందరం అలా చెప్తున్నాడేమో నన్న అనుమానం దమయంతిలో కల్గింది

మొన్న ఆ మధ్య నువ్వు తెచ్చిన సంబందం ఖాయం చేసుకోలేదన్న కోపంతో నువ్వు డబ్బు లేదంటున్నావు గానీ, యీ సంబందమే అయితే నీ మేనగోడలు ఎంతగా సుఖపడుతుందో ఆలోచించ-వేరా అన్నయ్యా?! బ్రతుక్కు రికానాలేని ఓ బడి మాష్టారుతో నాకు సంబంధం చేసేవు అయినా అప్పుడప్పుడు వస్తూ, పదో, వందో,

ఎందుకిచ్చావు? అదే ఓ మంచి ఉద్యోగస్తుడి కిచ్చి నా వివాహం చేసినట్లయితే నాకీ పస్తులు, నీకా బాదలూ బెడదలు తప్పేవిగదా!" చిన్నగా చిప్పిల్లుతున్న కన్నీటిని తుడుచుకుంటూ అంది దమయంతి

సుందరం మీద ఆ మాటలు బాగా పన్జేశాయి జాలిగా, భేలగా, చెల్లెలివైపు చూసేడు

అవున్రా! నేను చేస్తున్న దానిలో తప్పేమిటో కాస్త ఆలోచించి చెప్పు! నీ మేనగోడలి బ్రతుక్కి ఓ చిన్న సాయం చేయమని కోరుతున్నాను నువ్వు ఎన్నిసార్లు చీ! అన్నా అదేమాట అంటానురా!

దమయంతి మాటల్లోని కోపం, విసురూ సుందరం అర్థం చేసుకున్నాడు

సరే లేమ్మా! ఇక నీ పెళ్ళి ప్రయత్నాల్లో నువ్వుండు! ఆ సమయానికి నువ్వడిగిన ఆ అయిదు వేలూ యిచ్చే బాధ్యత నాది అంటూ ఆగి మళ్ళీ అన్నాడు

ఓసారి ఆ కుర్రాడిని చూస్తే బావుండి పోను!" అని

ఆ కుర్రాడు నీకు నచ్చుతా డన్నయ్యా! మంచి కుటుంబమే అతని తండ్రి పేరు రామారావట! చాల మంచి మనిషి నేనే వాళ్ళకు కబురంపి కుర్రాడిని రప్పిస్తాను అంది దమయంతి సంతోషాంతరంగంతో

సుందరం ఒప్పుకోలేదు

అదేంగాదు అతను పని చేసేది ఎక్కడో, ఏ ఆఫీసులో నో ఆ వివరాలన్నీ యిచ్చి వెళ్ళు నేనే వెళ్ళి కుర్రాడి మిగతా ఆరాలు తీస్తాను! అన్నాడు ఏదో ఆలోచిస్తూ

దమయంతి సరేనంది సంతోషంతో

*　　　*　　　*

కుర్రాడు అందంగానే కన్పించేడు సుందరం కళ్ళకు తన మేనగోడలు 'విజయ కు తగిన సంబందమే అనిపించింది

మీ నాన్నగారి పేరు? కుతూహలంగా అడిగేడు సుందరం అతన్ని

రామారావండి!" మేం లలితానగర్‌లో ఉంటున్నాం! మీరోసారి వచ్చి నాన్నగార్ని కలవండి! బావుంటుంది! అన్నాడా కుర్రాడు వినయంగా

సరేనంటూ తలూపి అక్కడి నుంచి కదిలేడు సుందరం

ఇల్లు సులభంగా కనుక్కోగలిగేడు

తలుపు తట్టి పిలవంగానే ఎవరూ? అంటూ వచ్చి, తలుపు తీసి చూసిన రామారావుకు ఎదురుగా సుందరం కన్పించేడు

సుందరాన్ని గుర్తుపట్టేడు రామారావు ఎన్నాళ్ళకెన్నాళ్ళకురా సుందరం! అంటూ చేతులు



# త్వరలో ప్రారంభం !

సుప్రసిద్ధ రచయిత్రి
రావినూతల సువర్ణా కన్నన్
కొత్త సీరియల్ నవల
**కరిగిన శిల**

ప్రఖ్యాత రచయిత
డా. కొత్త రవీంద్రబాబు
సరికొత్త సీరియల్
**సంకెళ్లెవరికి ?**

సాచి ఆప్యాయంగా లో పలకు తీసుకెళ్లాడు

దమయంతి నా చెల్లెలేన్రా! వాళ్లమ్మాయికే మి అబ్బాయిని అడిగింది కూర్చుంటూ తను వచ్చిన పనిని చెప్పసాగేడు సుందరం

దమయంతి మి చెల్లెలా?! అప్పుడే అనుకున్నాను ఎవరో మంచి కటుంబం నుంచి వచ్చినావిడేనని ఒరే సుందరం మి చెల్లెలి కూతురు మాకు బాగా నచ్చిందిరా" మా అబ్బాయి కూడా ఇష్టపడ్డాడు ఇక మిగతా విషయాలు మామూలే' అన్నాడు రామారావు

సుందరం మనస్సులో ఏదో సందేహం కదిలింది

అసలు విషయం చెప్పకుండా దాటేస్తావేరా? మి అబ్బాయికి కట్నం క్రింద అయిదువేల రూపాయలు అడిగేరనీ పైగా ఖర్చులూ అవీ ప్రత్యేకం అని అన్నారని మా చెల్లెలు నాతో చెప్పింది అన్నాడు సుందరం

ఆ మాటలకు నిర్ఘాంతపోయేడు రామారావు

అయిదువేలు కట్నం ఏమిటి? అలా అని ఆమె నీతో చెప్పిందా? అన్నాడు రామారావు

ఆ! స్వయంగా మా చెల్లెలే ఆ విషయం చెప్పింది! ఏం అలా అడిగేవు? ప్రశ్నించాడు సుందరం

నేనడిగింది అయిదువేలు కాదురా సుందరం"

మరి??

నేను మా వాడి కట్నం విషయమై అడిగింది పదివేల రూపాయలు అయినా మి చెల్లెలు నీతో ఎందుకలా అందో నాకు అర్థంకావడంలేదు ఓ అయిదువేలు మా వాడికి పెళ్లి ఏటల మీద చదివించేసి ఆనక మిగతా సొమ్ము ఎగ్గొట్టాలని అనుకుందేమో పాపం" అదేం కుదరదు

రామారావు స్వరంలో కాఠిన్యం తొంగి చూసింది

ఒరే" మనం చదుకునే రోజుల్లో ఏమేం మాట్లాడుకున్నామో ఎలాంటి నిర్ణయాలు తీసుకున్నామో మరిచిపోయేవ్రా?? వరకట్నాన్ని నిషేదంపై గంటసేపు ఉపన్యాసం దంచేసి మొదటి బహుమతి కూడా సంపాదించేవు ఓసారి" అలాంటివాడివి నువ్వేనా ఇలా మాట్లాడుతున్నది?? నిందాపూర్వకంగా అన్నాడు సుందరం

## లింకు

రామారావు సుందరం మాటలకు నవ్వేశేడు ముందు

సుందరం! చదువుకునే రోజుల్లో ఆ ఆశయాలూ ఆవేశాలూ వేరు ఇప్పటి పరిస్థితులూ వేరు నా పెళ్లికి కట్నం అస్సలు తీసుకోననీ నా పిల్లలేవ్వరికి కట్నం తీసుకోవడంగాని యివ్వడంగాని జరగదనీ మైకు ముందు ఉపన్యాసం యివ్వడం మర్చిపోలేదు నేను ఆ విషయంలో నావరకూ నేను 'లలిత ను కానీ కట్నం తీసుకోకుండా పెళ్లి చేసుకున్నానురా! కానీ యిప్పుడు నా కొడుక్కు కట్నం తీసుకోవాల్సిన పరిస్థితి వచ్చింది ఎందుకో తెలుసా?! ఎదిగొచ్చిన నా ఒక్కగానొక్క కూతురికి నేనూ పెళ్లిచెయ్యాలి వరుణ్ని సంపాదించి, కాళ్ళు కడిగి కట్నం పోసి కన్యాదానం చేయాలి మరిదెలా సాధ్యం అవుతుందో చెప్పు' నేనేం బాగా ఉన్నవాడినిగాదు జీవితాన్ని ఆశయాల కనుగుణంగా మల్చుకోవడానికి కాస్త ఆలోచించి చెప్పు సుందరం??

ఆవేశంగా ఆ నాలుగు మాటలూ అని ఆగేడు రామారావు రామారావు అన్నదాన్లో ఎంత నిజాయితీ దాగివుంది ఎంత జీవిత సత్యం యిమిడివుంది ఆలోచించసాగేడు సుందరం

తను మాత్రం ఏం చేసేడు? ?

కట్నం అంటే ఎలర్జీ అంటూనే కట్నం తీసుకున్నాడు ఆ కట్నం సొమ్ముతో ఓ మాంచి ఉద్యోగాన్ని కొనుక్కున్నాడు కొనుకున్న ఆ ఉద్యోగం సాయంతోనే సుఖంగా బ్రతగ్గలుగుతున్నాడు ఇదో చెయిన్ లింకు

మళ్లీ రామారావు స్వరం పలికింది హఠాత్‌గా

ఇదో విషవలయంరా సుందరం బ్రతుకు పెళ్లి కట్నం మళ్లీ బ్రతుకు ఒకదాన్నొకటి లింక్ అయి వుంటాయెప్పుడున్నూ" ఎందరు గురజాడలు అవతరించినా సంఘంలోని ఈ ఆచారాన్ని మొదలంటా రూపుమాపటం కల్ల! ఆశయాలూ ఆచరణలూ రైలు కమ్మెల్లా సమాంతరాలు ఎప్పుడూ కలుసుకోవు కలపాలని మనం ప్రయత్నిస్తే బండి బోల్తా పడుతుంది అలాగే ఈ జీవితం కూడా బోర్లా పడిపోతుంది మరింక లేవలేం'ఇప్పుడు చెప్పు అయిదువేలో పదివేలో కట్నం తీసుకోకపోతే నా కూతురికి కట్నం సమస్య లేకుండా పెళ్లి జరుగుతుందంటావా? ఆ మంచి రోజులున్నాయా? పోనీ

నా కూతురికి కట్న సమస్యలేని ఓ సంబంధం నువ్వు కుదర్చగలవా? అలా చేస్తానంటే నీ మేనగోడల్ని కానీ కట్నం లేకుండా మా అబ్బాయికే చేసుకుందుకు నేను రడీ" చెప్పరా సుందరం? మాట్లాడవేం??

క్షణం క్షణం పెచ్చు పెరిగే ఆ ఆవేశాన్ని చూసి నోటమ్మట మాటలు రాక ఆగిపోయేడు సుందరం

నిజమే" అందరూ నువ్వన్నట్లే ఆలోచిస్తే యిప్పటి ఆడపిల్లలకు వివాహ సమస్యలే లేవు ఈ వరకట్నం చావులే అస్సలుండవు ఆ రోజుల్లో నీ ఆశయాల్లో శ్రోతల్ని ఉర్రూతలూగించినట్లే, ఈ రోజు నీ వివరణతో నన్ను కట్టేశావు ఒరే! త్వరలోనే ముహూర్తాలు పెట్టించు వస్తాను' లేవబోతున్న సుందరాన్ని ఆపేసేడు రామారావు

నువ్వు విన్నట్లుగానే కట్నం బాపతు అయిదు వేలూ జతపర్చమని మి చెల్లెలితో వెళ్లి చెప్పు' ఆమె అన్నదే నిజం! నేనడిగింది అయిదు వేలే" నవ్వేడు రామారావు

ఒరే ఒరే" ఇప్పుడే గదరా పదివేలని అన్నావు? సందేహంగా అన్నాడు సుందరం

అవున్రా! అన్నాను అంటే? ఏమొచ్చిందిప్పుడు? అన్నట్లుగానే పదివేలూ మి చెల్లెలి చేత ఇప్పించేస్తావా?! నిజం చెప్పాలి నిన్ను చూసేక నువ్వేమంటావోనని అలా అన్నాను అంత కట్నం పాపం మి చెల్లెలు బావ ఎలాతేగల్గుతారు?" మి బావ సంగతి నాకు తెల్సు అంటూ లేచేడు రామారావు

ఎంతయినా మాటల ప్రోగువి అన్నాడు సుందరం తనూ లేచి అక్కడి నుంచి కదల్తూ

□

## వ్యక్తిగతం



కాంగ్రెసు(ఐ) పార్టీ ప్రతిష్ఠను దిగజార్చే విధంగా బాహాటంగా, ఉద్దేశపూర్వకంగా వ్యవహరిస్తున్నారన్న ఆరోపణపై కేంద్ర మాజీ ఆర్థికమంత్రి శ్రీ ప్రణబ్ ముఖర్జీని పార్టీ ప్రాథమిక సభ్యత్వం నించి ఆరేళ్ల పాటు బహిష్కరించారు. కాంగ్రెసు అధ్యక్షుని హోదాలో, ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ ఈ చర్య తీసుకున్నట్లు అఖిలభారత కాంగ్రెసు సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ మూపనార్ ప్రకటించారు. ఉత్తరప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి, లోక్‌సభ సభ్యుడు శ్రీ శ్రీపతిమిశ్రా, మాజీ కేంద్రమంత్రి, రాజ్యసభ సభ్యుడు శ్రీ ఎ. పి. శర్మ, అస్సాం మాజీ గవర్నర్ శ్రీ ప్రకాశ్‌మెహరోత్రాలని కూడా పార్టీ వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొన్నారన్న ఆరోపణపై కాంగ్రెసు (ఐ) నుంచి సస్పెండ్ చేసారు.... □



డాక్టర్ ఎన్. రామమూర్తి కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖలో అసిస్టెంట్ కమిషనర్‌గా భారత గణాంక సర్వీస్‌లో పని చేస్తున్నారు. వీరికి భారతీయ వ్యవసాయ పరిశోధనా మండలి 1984వ సంవత్సరానికి ఇచ్చే ప్రతిష్ఠాకరమైన జవహర్‌లాల్ నెహ్రూ అవార్డుకి ఎంపిక చేసింది. డా. రామమూర్తి ఆంధ్రప్రదేశ్‌లోని మంజీరా నదిపై నిర్మించిన 'నిజాం సాగర్ ప్రాజక్టులో నీటి నిలువ, దాని ఆయకట్టులో నీటి పారుదల పద్ధతిలో పొదుపు- పంట ఆర్థిక ప్రభావం' అన్న సిద్ధాంత పరిశోధనా గ్రంథం సమర్పించినందుకు ఈ అవార్డుకి ఎంపిక చేయబడ్డారు. ఈయన అనంతపురం జిల్లాకి చెందినవారు. ఆర్థిక, గణాంక శాస్త్రాలలో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి పోస్టుగ్రాడ్యుయేట్ పట్టాలు పొందారు. అనంతరం కేంద్ర ప్రభుత్వంలో పని చేస్తూ పరిశోధన చేసి ఆర్థిక శాస్త్రంలో డాక్టరేట్ తీసుకున్నారు... □

## వారఫలం

30-5-1986 శుక్రవారం మొదలు 5-6-1986 గురువారం వరకు

★ **మేషం :** ముందు వెనక లాలోచించి కార్యరంగాన దిగాలి వ్యాపారానికి అవసరమైన ధనాన్ని సేకరించుటయందు నిమగ్నులు కావాలి వస్తు సేకరణకు, క్రయవిక్రయాధులకు అనుకూలవారం రాజకీయంగా క్షేమకరమైన సమయంగాదు స్త్రీలకు జాగరూకత అవసరం

★ **వృషభం :** బంధు మిత్రుల సహాయం ఒకానొక విషయంలో కోరుకొన్నారుగా' లభ్యం కావటానికి ఆక్షేపణలేదు ఇతరుల దగ్గర నుండి రావలసిన ధనం సేకరించుకొనుటకు అనుకూల కాలం, గ్రహించి, యత్నించి మేలు పొందండి రాజకీయవాదులకు ఎలాంటి ప్రయోజనం లభ్యం కాబోదని గ్రహించాలి స్త్రీలకు అప్రయత్న ధనలబ్ధి, వస్తు సేకరణకు అవకాశాలు

★ **మిధునం :** వ్యాపార, ఉద్యోగాలందు వృద్ధి గల సమయం అతిశ్రమమిన మీ డబ్బు మీకు అందగలదని గ్రహించాలి దైవ కార్యాచరణకు అవకాశం రాజకీయంగా ఎలాంటి ప్రయోజనం లభ్యం కాదని గ్రహించాలి పెద్ద మొత్తంగా డబ్బు ఖర్చు కావలసిన పరిస్థితి ఉంటుంది స్త్రీలకు ఆదాయాన్ని మించిన ఖర్చులు, అర్థం కాని ఆందోళన

★ **కర్కాటకం :** వ్యాపార వ్యవహారాలందు అనుకూలత గలదని చెప్పనవసరంలేదు మీ డబ్బు మీకు అందగలదని వ్రాయనవసరంలేదు అన్ని రంగాలలో అనుకూల కాలమని గ్రహించాలి సత్కార్యాచరణమునకు అనుకూలం గ్రహానుకూలత గలవారం శ్రమకు తగిన ఫలితమున్నది స్త్రీలకు స్థిరచరాస్తులందు పెంపు, స్వల్పాదాయానికి ఆస్కారం

★ **సింహం :** ఇంత వచ్చింది, అంత చిక్కింది, ఇలా జరిగింది అలా జరిగింది, కాలం అనుకూలమా కాదా అని అనుకొనవసరంలేదు సర్వానుకూలత చేకూరగల వారం శుభ కార్యాచరణమున కనుకూలం దైవ కార్యాచరణమునకు అనుకూలం స్త్రీలకు ఉద్యోగమందు పెంపు, వ్యాపారం చేసేవాగైతే చక్కని అవకాశాలు లభిస్తాయి గ్రహించండి

★ **కన్య :** శ్రమించి ఋరు పొందజాలని లాభం ఈ వారంలేదు రకరకాలు పచకాలు వేయగల శక్తి యుక్తు లేర్పడుతాయి రాజకీయంగా మీ మనోవాంఛితం నెరవేర్చిస్తుంది కుటుంబ వ్యవహారాలు శ్రమకరంగా కనిపిస్తాయి ఉద్యోగంలో వృద్ధికి ఆస్కారమున్నది స్త్రీలకు ఉద్యోగరీత్యా, రచనా విధానంగా లాభించేవారం గ్రహించండి

★ **తుల :** వ్యవహారరీత్యా యిది ఉత్తమ ఫలదాయక వారం అంటే ఎంత గడ్డు వ్యవహారమైనా మధ్యవర్తిత్వం ద్వారా 'సానుకూలం కాగలదని,' అందు మీదే పైచేయి' అని గ్రహించాలి. స్వల్పాదాయమున్నది. స్త్రీలకు : చాలా కాలంగా ఎదురు చూచే 'ఆర్డరు' అందటం, వాహన సౌకర్యం లభించటం వారఫలం.

★ **వృశ్చికం :** స్థిరాస్తి వ్యవహారాలు కొంత చికాకును కలుగ జేయకమానవు వృత్తియందలి ఆటంకాలు దాటుకొని పోవాలి. సహాయం అర్థించి వచ్చిన బంధుమిత్రులను ఆదుకోవాలి. తగిలిన కాలికి దెబ్బతగిలినట్లు ఖర్చుపై ఖర్చు తగులుతుంది. గ్రహించాలి. స్త్రీలకు : విధి విరామంలేని పనులు, అధిక వ్యయం చెప్పదగిన వారం

★ **ధనుస్సు :** ఏ నాడో జరుగవలసిన శుభ కార్యాలగూర్చి బంధువులతో చర్చలుంటాయి. మీ మాటకే యింటా బయట మన్నన లభిస్తుంది విలువైన వస్తువులో, దుస్తులో, వాహనమో సంపాదించుకొనుటకు అవకాశమున్నది. స్త్రీలకు : ఉద్యోగరీత్యా పెంపు, అనవసరపు ఖర్చులు, మనశ్శాంతికి లోపం.

★ **మకరం :** వెనుక కొంత వరకు ప్రాకులాడి వదలిన వ్యవహారాలు మరలా ఈ వారం తిరగ తోడనున్నారు. సక్రమంగా ప్రాకులాడ గలిగితే మీకే అనుకూలం. రాజకీయంగా ఏ విధంగా లాభంలేదుగాన ఊరకే తాపత్రయపడి కాలం వ్యయించకండి. బంధుమిత్రులతో మనస్పర్ధలు రాగలవేమో గ్రహించి మెలగండి. స్త్రీలకు: శుభ కార్యాచరణమునకు, రచనయందు పేరు గడించుటకు అనుకూలం.

★ **కుంభం :** స్థితిగతులందు చెప్పదగిన మార్పుగలదు. ఒళ్ళువంచి శ్రమించటం అవసరం. ఎంత కృషి చేస్తే అంత లాభం పొందగలరు. వృత్తియందు పెంపున్నది. చక్కని ఆదాయమున్నది. ఆరోగ్యం బాగా పుంజుకొంటుంది. గ్రహించి మెలగాలి. వస్తు సేకరణకు అవకాశమున్నది స్త్రీలకు : వృత్తియందు పెంపు, స్వల్పాదాయం, ప్రయాణానుకూలం. సుఖ సంతోషాలుంటాయి. గ్రహించాలి.

★ **మీనం :** రాజకీయంగా మీ యత్నాలు సాగిరాగలవు. అందుచేత ప్రాకులాడటం శ్రేయస్కరం. కాలం అనుకూలం అయినపుడే కార్యాచరణకు దిగాలి. కొందరకు సాహితీ మార్గాన లాభదాయకమైన వారం 'వారం వారం యింతేనా అనుకోరాదు. ఇప్పుడు యత్నించి చూడండి. కార్యసాధనకు అనుకూలం. స్త్రీలకు : రాజకీయములందు ప్రగతి, కార్యసిద్ధి, ధనలబ్ధి.

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

సీరియల్

# సర్ప యాగం



(గత సంచిక తరువాయి)

ఈ సారి ఎలాగైనా తనకో ఆడదాన్ని తోడుగా తెచ్చుకోవాలనే ఉద్దేశ్యం తోటే వెంకట్రాముడు ఆ జాతరకొచ్చాడు మనువుల బండ మీదున్న ఆడవాళ్లను పరిశీలనగా చూస్తున్న అతడి కళ్ళు హఠాత్తుగా ఓ చోట ఆగిపోయాయి బండపైతూర్పు వేపున కూర్చున్న ఆ అమ్మాయి అయస్కాంతంలా వెంకట్రాముడి చూపుల్ని ఆకర్షించింది

తెలుగు రచయిత్రులు తమ కల్పనా చాతుర్యాన్నీ వర్ణనా నైపుణ్యాన్నీ శాయశక్తులా ఉపయోగించి తీర్చిదిద్దే నవలా నాయికలా ఆ అమ్మాయి అందంగా లేదు హీరోలతో గంతులేసే తారామణి ముఖం మీద మూరెడెత్తు పులుముకున్నట్టుగా ఆ అమ్మాయి తన ముఖం మీద ఎలాంటి రంగులూ పులుముకోలేదు

ఆ అమ్మాయికి యిరవై ఎళ్ళుంటాయి పేరు గౌరి అందగత్తె కాకపోయినా అనాకారి మాత్రం కాదు బర్త్ను పేరు పెట్టి ఎలవడమే నాగరికత అనే భ్రమలేవీ ఆ అమ్మాయికి లేవు అసమర్ధుడైన మొగుడు కొంపలో తగలబడి బీడిలు తగలేస్తుంటే ఆఫీస్లో కూర్చుని పక్కనున్న పాతికేళ్ళ అందమైన అకౌంటెంట్పై చూపుల్ని పారేసుకునే కల్చర్ గురించి గౌరికి బొత్తిగా తెలియదు

గౌరి ఒంటికి చవక రకం చీర ధరించినా ఆకర్షణీయంగానే వుంది ఎడికెడు నడుంతో కోల మొహంతో వెంట్రుకల రంగూ ఒంటి రంగూ విడదీయలేనంత నల్లగా వుంది యానాది కులంలోని చాలా మంది స్త్రీలతో ఆ అమ్మాయిని పోల్చి చూస్తే గౌరి నిస్సందేహంగా అందగత్తె

కన్నార్పకుండా వెంకట్రాముడు గౌరినే చూస్తున్నాడు స్వర్గం నుండి సరాసరి వూడిపడిన సౌందర్యపు ముక్క అని అన్పించకపోయినా అతడి కంటికి అన్నివిధాలా గౌరి నచ్చింది ఈ అమ్మాయి తనను యిష్టపడుతుందా? తన భార్యగా ఉండడానికి అంగీకరిస్తుందా? వెంకట్రాముడి బుర్రలో గౌరికి సంబందించిన సందేహాలు చెలరేగాయి

మనువుల బండ చుట్టూ నిలబడి వున్న మగాళ్లను చూస్తున్న గౌరి చూపులు వెంకట్రాముడి చూపులతో ఢీకొన్నాయి అతడి వేపే రెండు క్షణాలు చూసి పలకరింపుగా గౌరి నవ్వింది ఆ నవ్వు వెంకట్రాముడి ఆశకు జీవం పోసింది ఇలారా అన్నట్టు గౌరిని కళ్ళతోటే సైగ చేశాడతడు

గోవిందుడు ఈ తతంగాన్నంతా పూర్తిగా గమనించాడు వెంకట్రాముడి కళ్ళ సైగను అర్థం చేసుకున్న గౌరి బండ మీది నుండి పైకి లేచి మెల్లగా వెలుపలికొచ్చింది తర్వాత యిద్దరూ కలిసి కొంత దూరంగా వెళ్ళి నిలబడ్డారు వాళ్ళిద్దరి నడుమ తనెందుకులే అని గోవిందుడు బండ వద్దే నిలబడ్డాడు

యేం వూరు? - వెంకట్రాముడి ప్రశ్న

తురకపల్లి - గౌరి జవాబు

మొగుడు యిడ్సిపెట్టేసినాడా?

కాదు నేనే యిడ్సిపెట్టేసినా

యెందుకని?

దొంగ సచ్చినోడు రెయ్యింబొగులూ తాగొచ్చి నన్ను సావగొట్టేటోడు

బిడ్డలా?

లేదు

ఇద్దరి మధ్య రెండు క్షణాలు మౌనం

మీదే వూరు? - గౌరి ప్రశ్న

దేవరకొండ - వెంకట్రాముడి జవాబు

పెండ్లి అయిందా?

అయింది ఆ బాకాలి (భాగ్యశాలి)తో తెగతెంపులు సేసుకొంటి

బిడ్డలు

అంతదాకా కాపరం సెయ్యలేదులే

అయితే నన్ను

నాతో తొడుకొని పోతా నీకిష్టమైతే - అంటూ తన యిష్టాన్ని గౌరికి తెలిపాడు వెంకట్రాముడు

గౌరి కూడా అతడితో వెళ్ళి కాపురం చెయ్యడానికి ఒప్పుకుంది ప్రపంచాన్ని జయించిన విజేతలా వెంకట్రాముడి మనస్సు ఆనందంతో నిండిపోయింది వాళ్ళిద్దరి చేయీ చెయి కలిసింది అయితే చేయీ చేయీ కలిసింది అంటూ యుగళగీతం పాడుకోడానికి వాళ్ళు అర్జెంటుగా ఊటీ వెళ్ళిపోలేదు

యంకట్రావన్నా

యేంవిరా గోయిందూ?

ఆ వూసలపండ మూదు యెంత బాగుందో - వేళాకోళంగా అన్నాడు గోవిందుడు

కొనుక్కుంటావా?

నేనా? నాకైతే అయిదారు దినాలపైన వొచ్చే దానికి ఎనికోస్తాది నకైతే

గోవిందుడి మాటల్లోని అంతరార్థం గ్రహించి నవ్వుకున్నాడు వెంకట్రాముడు

తీస్కుంటావా? - గౌరికి ఆచంతను చూపెట్టి అడిగాడు వెంకట్రాముడు

జరిగిన కథ -3 దేవరకొండ గ్రామంలోని ప్రాథమిక పాఠశాలలో పంతులు గుర్నాధం వీర్రాజు గుర్నాధం మాట్లాడుతుండగా స్కూలు బయట పాము వచ్చిందని పంతులుతో చెప్తాడు బాలయ్య బాలయ్య పాములను పట్టే యానాది వాడిని ఎలుచుకు రావడానికి వెళ్తాడు ఇంతలో నాగరాజు అక్కడికి చేరుతాడు ఆ గ్రామంలో మంచి పలుకుబడి ఉన్న వ్యక్తి నాగరాజు వెంకట్రాముడు వచ్చి పాముని పట్టేసాడు నర్సయ్య కొడుకు గోవిందుడికి నాగినితో పెళ్ళి నిశ్చయ మవుతుంది వెంకట్రాముడు తాను కూడా పెండ్లి చేసుకోవాలనే ఉద్దేశ్యంతో జాతర జరిగే రోజున గోవిందుడిని వెంట పెట్టుకుని మనువుల బండ దగ్గరికి వెళ్తాడు



"బాగుంది నీయవారం. యెద్దునడిగి యెవురన్నా గెంట కడతాలా? నువ్వు తిసియ్యాల గానీ వొదిన్ని అడక్కూడదు"– గోవిందుడు నవ్వుతూ అన్నాడు.

వెంకట్రాముడు వెంటనే చొక్కా జేబు లోంచి అయిదురూపాయల నోటును తీసి.... అంగడి వాడికిచ్చి, దండను తీసుకున్నాడు. ముగ్గురూ మాట్లాడు కుంటూ కొంత దూరం వచ్చారు. అక్కడ కొంత చీకటిగా వుంది.

"కొంచెం ఆగు"– వెంకట్రాముడన్నాడు.

గౌరి నిలబడి వెంకట్రాముడు వేపు ప్రశ్నార్థకంగా చూసింది. అతడు తన జేబు లోంచి దండను తీసి గౌరి మెడకు తగిలించ బోయాడు. గౌరి సిగ్గు పడింది.

"పరావోళ్ళవురూ సూత్నేదులేనే. యీ గోయిందుడు మనోడేలే"– అన్నాడు వెంకట్రాముడు.

* * * *

ఇంటి వద్ద వరండాలో పట్టిమంచంపై కూర్చుని ఏదేశం మీద బాంబు వేద్దామా అని ఆలోచించే అగ్రదేశాధిపతిలా వున్నాడు పాలకొండ నాగరాజు రాజకీయాల్లోకి దిగి పదవుల్ని వెలగబెట్టక పోయినా అయనకి రాజకీయాలు కొట్టినపిండే కొందరు నాయకులు ఆయన దగ్గరకు సలహాల కోసం వస్తుంటారు

పట్టె మంచం మీద కూర్చుని వున్న నాగరాజుకు కొంచెం ఎడం వేపు కుర్చీలలో ప్రధాన మంత్రి ముందు క్యాబినెట్ మంత్రుల్లా నలుగురు వ్యక్తులు చాలా వినయంగా కూర్చుని వున్నారు వాళ్ళు వీర్రాజు గురవయ్య గుర్నాథం కొండయ్య నాగరాజుకు వుండే బట్రాజు బృందంలో ఈ నలుగురూ ముఖ్యులు

ప్రాణమిత్రులైన యిద్దరి వ్యక్తుల నడుమ పావు గంటలో పచ్చగడ్డి వేస్తే భగ్గున మండి పోయేంత [illegible]న పరిస్థితిని సృష్టించ గల నేర్పరి కొండయ్య చిన్నప్పుడతడు చిన్నయసూరి మిత్రబేదాన్ని చదివి అందులోని నీతికి బదులు కరటక దమనకుల స్వబావాన్ని మాత్రం సంపూర్ణంగా ఒంట పట్టిచ్చుకున్నాడు కొండయ్య

దేవరకొండలో నాగరాజు చేస్తున్న అన్యాయాలకు శక్తి వంచన లేకుండా తమ శాయశక్తులా ఈ నలుగురూ నాగరాజుకు సహకరిస్తుంటారు విశ్వాసంగా పడి వుంటారనే ఉద్దేశంతో అప్పుడప్పుడూ ఈ నల్గురికి కొన్ని సుఖాలు కల్పిస్తుంటాడు నాగరాజు

వూరి సంగతులేందిరా వీర్రాజూ? – అంటూ వీర్రాజు వేపు సూస్తూగా

చూస్తూ అడిగాడు నాగరాజు

ఆయన వారం రోజుల నుండి ఆ వూళ్ళో లేడు ఆయన బస్తీలో ఓ కొత్త యిల్లును కట్టిస్తున్నాడు ఆ యింటి నిర్మాణానికి సంబంధించిన కార్యక్రమాలను అజమాయిషీ చెయ్యడానికి అవసరమైన వస్తువుల్ని కొని యింటి నిర్మాణానికివ్వడానికి నాగరాజు అప్పుడప్పుడూ బస్తీ వెళ్ళి వారం పది రోజులు గడుపుతుంటాడు

అన్ని పాత సంగతులేనండి సెప్పుకో తగ్గ సంగతులేఁవీ పెద్దగా లేవు – అన్నాడు వీర్రాజు ఎవరిదగ్గరైనా హద్దూ అపూ లేకుండా వీర్రాజు కోతలు కోస్తాడు గానీ ఒక్క నాగరాజు ముందు మాత్రం వీర్రాజు జాగ్రత్తగా మాట్లాడుతాడు

యేఁవిరా గురవా! నీ సారా యాపారం యట్ట సాగతా వుంది? – గురవయ్యను ప్రశ్నించాడు నాగరాజు

యేదో తఁవరి దయ – అంటూ బలవంతంగా పళ్ళికిలించాడు సారాకొట్టు గురవయ్య

కొత్తింటోళ్ళ బాయిలో నీళ్ళున్నంత వొరకు గురవయ్య యాపారానికేఁవి దిగుల్లేదు – అన్నాడు వీర్రాజు నవ్వుతూ

అది సరేగానీ లింగయ్య యేఁవన్నా ఈ మధ్య సారాకొట్టు కొస్తుండాడా? – అడిగాడు నాగరాజు

యీ మధ్యేంటి? అసలు లింగయ్య కొట్టుకు రాని రోజంటూ లేదు – చెప్పాడు గురవయ్య

వోడికి సారా అప్పు పోస్తావుండావా?

తఁవరు అప్పు పొయ్యమని సెప్తిరంట అందుకని లింగయ్యకు రోజూ అప్పుగానే సారా పోస్తుండా

మ్ అయితే వో పన్జెయ్యి

సెప్పండి

లింగయ్య రేపు గానీ నీ కొట్టు కొస్తే వోన్ని మర్చిపోకుండా యీడికి తోడుకొనిరా

అట్టాగే నండి

వొరేయ్ వీర్రాజూ!

అయ్యగారూ!

నేను రేపు గానీ యింట్లోలేకపోతే లింగయ్య దెగ్గిర బాండు కాగితాల మీద యేలి ముద్దర్లు వెయ్యించిపెట్టు కాగితాలు నాటేబుల్ మీదుంటాయి

సరే నండి యేలి ముద్దర్లేనా? సెవ్రాలు సందేహంగా అన్నాడు వీర్రాజు

లింగయ్యకి సెవ్రాలు పెట్టేది రాదు

వోడికి ఆ మాత్రం సదువుంటే యింగ యీవూళ్ళో యెవుర్ని బతకనిచ్చేవోడు గాదు

యీ కాలంలో అచ్చరం ముక్క రాకపోతేనే మేలు యేదన్నా మినిస్టర్ పదవి దొరకతాది – అన్నాడు వీర్రాజు

వీళ్ళందరూ యిలా మాట్లాడుకొంటూ వుండగా సరిగ్గా అప్పుడే వీధిలో ఏదో గజ్జెల గుర్రం వెళుతున్నట్టుగా ఘల్లు ఘల్లుమంటూ శబ్దం వచ్చింది కాళ్ళకు వెండి గజ్జెలు ధరించిన స్త్రీ ఎవరో ఆ వీధిలో వస్తోందని వెంటనే గ్రహించాడు నాగరాజు అందరూ తలలు తిప్పి వీధి వేపు చూడసాగారు

నాగరాజు యింటిగేటు తలుపులు బాగా తెరవబడి వున్నాయి గనుక ఆ వీధిలో అటూ యిటూ ఎవరు వెళ్ళినా వరండాలో కూర్చున్న అందరికీ స్పష్టంగా తెలుస్తుంది ఆ గజ్జెల శబ్దం మరీ దగ్గరైంది నాగరాజు కన్నార్పకుండా వీధి వేపే చూస్తున్నాడు

ఎడికెదు నడుంతో మంచి శరీర సౌష్ఠవం కలిగి పచ్చ చీరను కట్టుకున్న పాతికేళ్ళ పడుచు పచ్చగడ్డి మోపును తలపై పెట్టుకుని ఆ వీధిలో నడిచి వెళ్ళింది నాగరాజు కళ్ళకు జిగేల్‌మంటూ కన్పించిందా పడుచు ముఖం సరిగ్గా కన్పించకపోయినప్పటికీ ఆ శరీర సౌష్ఠవానికి నాగరాజు మనసు చలించిపోయింది

సరే గుర్నాథం గురవయ్యా కొండయ్యా! మీరంతా యెల్లి రేపుగానీ యెల్లుండిగానీ కనిపించండి మీ అందర్తో కొంచెం పనుండాది వొరేయ్ వీర్రాజు! ఆ యింట్లోవుండే పరుపు తెచ్చి యీ మంచంపై పడేయ్ బళ్ళిగ్గా (అలసటగా) వుంది కాసేపు నడుంవాల్చాల – అన్నాడు నాగరాజు

ఆయన ఆ మాట అనగానే వీర్రాజు తప్ప మిగిలిన వాళ్ళు నాగరాజు వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయారు యింటిగేటును మూసి రమ్మని చెప్పడంతో వీర్రాజు గబగబా వెళ్ళి గేటును మూసి వచ్చాడు ఇంట్లోకి వెళ్ళి పరుపు తీసుకురావడానికి వెళ్ళబోయిన వీర్రాజును నాగరాజు దగ్గరకు పిలిచాడు

వొరేయ్! యిందాకా వీధిలో గడ్డిమోపును నెత్తిన బెట్టుకుని యెల్లిన ఆ ఎల్ల మెల్లగా అడిగాడు నాగరాజు

గంగులన్న రొండో కోడలు నెలకిందటే యీ వూరికి కోడలుగా వొచ్చింది పేరు యంకట లచ్చిఁవి పేరు బాగలేదుగానీ మనిసి మాత్రం వొజ్రం సంగతి కనుక్కోమంటారా?

ఆఁ కొంచెం తొందరగా – నాగరాజు అన్నాడు

# 5

ఉదయం ఎనిమిది గంటలు దాటుతోంది యానాది నర్సయ్య యింట్లోకీ వెలుపలికీ కాలుకాలిన పిల్లిలా ఒకటే తిరుగుతున్నాడు ఆ మామిడి తోటలోని యానాది పాకల ముందు ఎప్పుడూ లేనంత ఆర్భాటం కన్పిస్తోంది కారణం గోవిందుడికి నాగికి అక్కడ కొద్దిసేపట్లో వివాహం కాబోతోంది

మంత్రిగా పదవీ స్వీకారం చెయ్యబోయే ఎమ్మెల్యేలా గోవిందుడు చాలా సంబరపడిపోతున్నాడు పెళ్ళికి రావాల్సిన బంధువులంతా అప్పటికే వచ్చేశారు బంధువులందరూ కలిసి పదిహేనుమంది కంటే ఎక్కువలేరు వాళ్ళలో నర్సయ్యకు సంబంధించిన వాళ్ళు యిద్దరే మిగిలిన వాళ్ళు పెళ్ళికూతురి తరపున వాళ్ళు

వచ్చిన బంధువుల్ని పలకరించడం వాళ్ళకి అతిథి మర్యాదలు చెయ్యడంలో మునిగిపోయాడు వెంకట్రాముడు అక్కడ నర్సయ్య పాకకు దక్షిణంగా పొయ్యిమీద బానలు పెట్టి అన్నమూ కూరలూ వండుతూ మల్లక్క కన్నమ్మ గౌరి నానా తంటాలు పడుతున్నారు ఇక నర్సయ్య హడావుడికి అంతు లేదు

పెళ్ళి కూతురు నాగి పోలమ్మ మరో యిద్దరు ఆడవాళ్ళు వెంకట్రాముడి పాకలో గుంపుగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు వెంకట్రాముడి పాకే ఆవాళ్టికి వారి విడిది గృహం తన కూతురు నాగిని యిన్నాళ్ళకు ఓ యింటిదాన్ని చెయ్య గలుగు తున్నందుకు పోలమ్మ కెంతో తృప్తిగా వుంది

శుభ్రంగా తల స్నానం చేసి నుదుటి మీద ఎర్రనామం పెట్టుకున్నాడు గోవిందుడు కొత్త పంచెను కాళ్ళ వరకు దిగ విడిచి కట్టుకున్నాడు చేతుల దాకా కుట్టించుకున్న తెల్లని చొక్కా నల్లరేగడి భూమిమీది తెల్లని ఖండలా అతడి ఒంటిపై మెరుస్తోంది మాటి మాటికి చొక్కా సర్దుకొంటున్నాడు గోవిందుడు

యేఁవిరా యంకట్రాఁవా! అన్నం కూరలు వుడికి పోయినాయా లేదా? వొచ్చిన బందుగులకు తిండి తిప్పలు పెట్టకుండా మాడిస్తే అది మనకే బగిశాట్లు (అవమానాలు) భోజనాలైపోతే సగం పనైపోయినట్టే అనాక ముగూర్తానికి యేర్పాట్లు సూస్కోవచ్చు – వెంకట్రాముడితో అన్నాడు నర్సయ్య

అన్నం కూరలింకా వుడికినట్లు లేదు మొన్నరాలిన తుంపర ఎనుకులకు మొందు కట్టెలు తడ్సిపోయినాయి అందుకే అవి సరిగ్గా మండటం లేదు లేకుంటే వొంట లింకానా యెప్పుడో అయిపోవు – చెప్పాడు వెంకట్రాముడు

ఆ పొయ్యికాడ ముగ్గు రాడ మనుసులు సేరి అప్పట్నుంచి యేంజేస్తా

వుండా(రా? అన్నా లొండతా వుండారా' లేక అరుట్లు (బాతాఖానీ) కొడ్తా వుండారా? అన్నా లొండే దానికి యింతసేపా? యింత తీరుబాటా? – అంటూ వంటలు వండుతున్న ఆడవాళ్ళను విసుక్కున్నాడు నర్సయ్య

తోలు పెరికేసిన పాము మాదిరిగా యిప్పుడు నువ్వేంటి కట్లు యెగర్తా వుండేది? పొయ్యికాడ ఆడోళ్ళు తీరుబాటుగా యే(వన్నా వుండారా? అన్నం వుడికే దెంతసేపు? యింకో కాలుగెంట్లో (పావు గంటలో) ఆయిపోతాది యీలోగా జరగాల్సిన పనులే(వన్నా వుంటే సూడు – వెంకట్రాము డన్నాడు

జరగాల్సిన పనులేవి యింగ లేవబ్బా' అన్నీ అయిపోయినాయి ఆ పొసుపుతాడూ పూసలూ గవురి దెగ్గిర యిచ్చినాను వాటి సంగతేం సేసిందో గవుర్ని వొకమాట అడిగి తెల్సుకో – అంటూ నర్సయ్య గబగబా యింట్లోకి వెళ్ళాడు

గవురి! వొసె గవురి – అంటూ దూరంగా వంటల కార్యక్రమంలో మునిగిపోయిన గౌరిని ఎలిచి ఇలారా అన్నట్టు చెయ్యి విసరాడు వెంకట్రాముడు పొగచూరిన కళ్ళను నులుముకుంటూ వెంకట్రాముడి దగ్గరకు వచ్చింది గౌరి

గవురి! నీ దెగ్గిర పసుపుతాడూ పూసలూ యిచ్చినాడా పెద్దాయన? – అడిగాడు వెంకట్రాముడు

అవ్

ఆ పసుపుతాడుకు పూసల్ని అన్నీ కూర్చి పసుపుకొమ్ము కట్టి ఎద్దం సేసినావా?

యింగాలేదు

యింగాలేదా? అయితే ఆ పని యింగెప్పుడు సేద్దా(వనుకుంటా వుండావు? ముగూర్తం దెగ్గిర ఎడ్తా వుంది ముగూర్తం యాళకు బొట్టు ఎద్దంగా లేకుంటే యట్లమరి'

నన్నేం సెయ్యమంటావు? నేనే(వన్నా పన్లేక తీరుబాటుగా వుండానా? ఆ కట్టెలు మండి సావడం లేదు పొగతో కండ్లు నిప్పులు మాదిరోతు మండతా వుండాయి

సరే ఆ వొంటల సంగతి వొళ్ళిద్దురూ సూస్కూంటారు గాని నువ్వెళ్ళి పసుపుతాడూ పూసలూ ఎద్దం సెయ్యి పొద్దు నడినెత్తి కొస్తావుంది – వెంకట్రాముడా మాట అనగానే గౌరి తాళిబొట్టును ఎద్దం చెయ్యడానికి తన పాకలోకి వెళ్ళింది

యానాదులు ఆర్ధికంగా చాలా వెనుకబడిన వాళ్ళు ఆ గిరిజనులకు పాలక వర్గాలు కల్పించే అత్యల్పసదుపాయాలూ సహాయాలు కూడా వాళ్ళకు అందవు ఈ దేశంలోని కొందరు పెద్దలు వరదల్ని తుపానుల్ని చావుల్ని క్యాష్ చేసుకున్నట్టే ఆ యానాదుల అజ్ఞానాన్ని కూడా అవలీలగా క్యాష్ చేసుకోగలరు

కడుపు నిండా తిండి ఒంటి నిండా గుడ్డలూ లేని ఆ యానాదులు పెళ్ళిళ్ళను మాత్రం ఘనంగా ఎలా జరుపుకో గలరు? తిండకి పస్తులుండి టీ వీలు కొనడం అప్పుచేసి పుస్తకాల్ని అచ్చేసుకోనడం లాంటి ఆర్భాటాలేవీ వాళ్ళు చెయ్యరు పసుపుకొమ్ము కట్టిన పసుపుతాడే యానాదుల దృష్టిలో తాళిబొట్టు

ఇతర కులాలలోని పెళ్ళిళ్ళ ముహూర్తాలకూ యానాది కులంలోని పెళ్ళిళ్ళ ముహూర్తాలకూ చాలా బేదముంధి ఈ యానాదులలో పెళ్ళిళ్ళు మధ్యాహ్నంపూటే జరుగుతాయి పట్టపగలు పన్నెండు గంటలకు తాళిబొట్టు కట్టడం వాళ్ళ ఆచారం

పురోహితుడు రావడం ఎవరికీ అర్ధంగాని బాషలో మంత్రాలు చదవడం పెళ్ళి కొడుకూ పెళ్ళి కూతురూ బంతులాట లాడడం మెడలు విరిగి పోయేలా పూల మాలలు దరించి వూరేగింపు వెళ్ళడం లాంటి పనికి మాలిన ఆచారాలు ఆ యానాదులలో లేవు వాళ్ళ పెళ్ళిళ్ళు చాలా నిరాడంబరంగా జరుగుతుంటాయి

వెంకట్రాముడి పాకకు ఎదురుగా మామిడి చెట్టు నీడలో ఈతచాపలు పరచుకుని ఆరుమంది మగాళ్ళు కబుర్లు చెప్పుకుంటున్నారు వాళ్ళంతా పెళ్ళికూతురి తరపున యల్లంపల్లి నుండి ఆ పెళ్ళికి వచ్చిన యానాదులు వెంకట్రాముడు గబ గబగబా పరుగులాంటి నడకతో ఆ మామిడిచెట్టు వద్దకొచ్చాడు

అందరూ పైకి లేసి కాళ్ళూ సేతులూ కడుక్కోండన్నా బోజనాలు కానిద్దురు యిప్పటికే శానా యాళ అయిపోతావుంది – అన్నాడు వెంకట్రాముడు

బోజనాలు కావాలంటే మే(వు నిదానంగా తింటాంగానీ మాకు వుడుకునీళ్ళ మరియాదలేం లేవా? – అన్నాడు నవ్వుతూ ఆ గుంపులో కూర్చున్న ఓ పెద్దమనిషి

## గడుసులోకం —బాబు






డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**పి. ఎస్. విజయవాడ**

కాళ్లు, చేతులు ఎందువల్ల వణుకుతాయి? నరాలబలహీనత అంటారా? ఇలా ఎందుకు జరుగుతుంది? నాకు అప్పుడప్పుడు ఇలా వణుకుతాయి కనీసం చెంచాను కూడా ఆ సమయంలో పట్టుకోలేను నా వయస్సు 28 సం లు బ్లడ్‌ప్రెషర్ లేదు ఆరోగ్యం బాగానే ఉంది కొన్ని మందులు వాడుతున్నాను ఫలితంలేదు

**థైరా టాక్సికోసిస్ అనే రోగం థైరాయిడ్ గ్రంథి ఎక్కువగా పనిచెయ్యటం వల్ల వస్తుంది. ఆ రోగం ఉన్నవారికి చేతులు వణుకుతాయి. నరాల బలహీనత వల్ల 'ట్రిమర్స్' ఏర్పడతాయి. న్యూరాలజిస్టులు పరీక్షచేసి రోగ నిర్ధారణ చెయ్యవలసి ఉంటుంది. సైకలాజికల్ కారణాలవల్ల ఇలా కొన్ని సమయాలలో మాత్రమే వణకటం జరుగుతుంది.**

**డి ఎ. రాజంపేట**

నాకు 20 సంవత్సరములు వివాహమయి 3 సంవత్సరములయినది మొదటి బిడ్డ పుట్టినప్పుడు నాకు టైఫాయిడ్ వచ్చినది వైద్యము చేయించుకున్నాను రెండవ బిడ్డ పుట్టిన మూడు నెలలకు విపరీతమైన దగ్గు శ్లేష్మంతో వచ్చినది ఈస్నోఫిలియా 15 శాతం వున్నదన్నారు ఇప్పుడు తలనెప్పిగూడా వచ్చినది మందులు వాడినా తగ్గలేదు చాలా బలహీనముగావున్నది

**మీరు ముందుగా కఫ పరీక్ష, ఛాతీ ఎక్స్-రే మొదలయినవి చేయించి చెస్ట్ స్పెషలిస్టులకి చూపించండి ప్రత్యక్షంగా పరీక్షించనిదే రోగ నిర్ణయం చెయ్యలేము.**

**వి. ఎస్. ఊరదల్లపాలెం**

నా నడుముకి ఒక ప్రక్క చిన్న చిన్న పొక్కులు లేచి దురద వస్తోంది గోకినప్పుడు చితికి అక్కడ మచ్చలు ఏర్పడుతున్నాయి ఏ మందు వాడితే పూర్తిగా నయమవుతాయి?

**అలా పొక్కులు వచ్చినప్పుడు 'వైద్యుల పర్యవేక్షణలో యాంటీబయాటిక్ మందులు లోనికీ, పై పూతగాను వాడవలసి ఉంటుంది. దురదకి అంటీ హిస్టమిన్ మాత్రలు - (అవిల్, పిరిటాన్ వంటివి) వాడటం మంచిది.**

**ఎం. ఎస్. మహబూబ్‌నగర్**

నా వయస్సు 35 సంవత్సరములు నేను స్టాఫ్ నర్స్ ఉద్యోగం చేస్తున్నాను మెన్సస్ రాకుండా ఉండేటందుకు మందులు ఉన్నాయా అంటే పూర్తిగా ఆగిపోవాలి

**అలా చెయ్యటానికి నిరంతరం మందులు వాడకూడదు. తాత్కాలికంగా ఆపుచెయ్యటానికి మాత్రమే వాటిని వాడవలసి ఉంటుంద. నిరంతరంగా వాడటం వల్ల ఇతర రోగాలు వచ్చే అవకాశం ఉంటుంది. స్టాఫ్ నర్స్ కాబట్టి వీటి వివరాలు మీకే తెలిసి ఉండాలి.** □

# సత్ప్రయోగం

వుడుకునీళ్లా? యెందుకన్నా? మీరంతా స్నానాలుగానీ సేస్తారాయట్న? – వెంకట్రాముడు అలా ప్రశ్నించగానే మామిడిచెట్టు కింద కూర్చునివున్న వాళ్ళంతా కడుపు చెక్కలయ్యేటట్టు పగలబడి నవ్వసాగారు వాళ్ళెందుకలా నవ్వుతున్నారో వెంకట్రాముడికి బొత్తిగా అర్థంకాలేదు

'ఉడుకునీళ్ళు' అంటే వాళ్ళ పరిభాషలో సారా అని అర్థం అయితే వెంకట్రాముడికి తాగుడు అలవాటు లేకపోవడంచేత ఆ పదంలోని గూడార్థం వెంటనే అతనికి బోధపడలేదు అందుకే తనను చూసి విరగబడి నవ్వుతున్న వాళ్ళందరివేపు ప్రశ్నార్థకంగా చూశాడు వెంకట్రాముడు

ఉడుకునీళ్ళంటే. నిజమైన వుడుకునీళ్ళు కాదన్నా సారాయి"– అంటూ మరొకడు వెంకట్రాముడికి ఆ పదంలోని అసలు అర్థాన్ని వివరించి చెప్పాడు

పెళ్ళిళ్ళకూ, పండుగలకూ, పబ్బాలకూ, యితర ఫంక్షన్లకూ పదిమంది కలిసి గొంతులవరకు మత్తుపానీయాల్ని సేవించి పార్టీలు చేసుకోవడం ఈ నవీన సమాజంలో ఓ నాగరికతా లక్షణంగా పరిగణింపబడుతోంది. ఎప్పుడూ తాగని వాడిని కొందరు కల్చర్ లేనివాడిగా చులకనగా చూస్తున్నారు

మానవ జీవితంలో ఈ మత్తు పానీయాలు ప్రధాన పాత్ర వహించే స్థాయికి ఈ వ్యవస్థ ఎదిగిపోయింది ఈ సత్యాన్ని గ్రహించిన మనరాజకీయ నాయకులు కొందరు ఎన్నికల సమయాలలో సారాను ప్రయోగించి ప్రజాస్వామ్యాన్ని సులభంగా వశపరచుకుంటూ వుంటారు

నాగరికులలో లాగే యానాదులవంటి అడుగువర్గాలలో కూడా తాగుడు బాగా ప్రబలిపోయింది యానాదుల పెళ్ళిళ్ళ సమయంలో వచ్చిన బంధువులకు సారా ఎంత ఎక్కువగా పోయిస్తే పెళ్ళి అంత ఘనంగా జరిగిందని వాళ్ళు అభిప్రాయపడతారు అందుకే సారా ఖర్చుకు అవాళ ఎవరూ వెనుకంజ వెయ్యరు

సారాయి సంగతి నాకు తెలవదన్నా మా పెద్దయ్యగూడా దీని గురించి నాతో సెప్పలేదు– వెంకట్రాముడన్నాడు

అదేంటన్నా' యిట్టాంటి సంగతులన్నీ వొకరు యిలావరిగా సెప్పాల్నా? బందుగులుసేత అడిగించుకుని మరియాదలు సెయ్యకూడదు– అన్నాడొకడు అతిథులకు సారా పొయ్యించడం మీ కనీసధర్మం అన్నట్టు

యిప్పుడుమాత్రం మించిపోయిందేవుంది? మీరిన్నే వుండండి నేను మా పెద్దయ్యతో యీ సంగతి మాట్లాడొస్తా"– అంటూ వెంకట్రాముడు నర్సయ్యవద్ద కెళ్ళాడు

వెంకట్రాముడు చెప్పిన సారా విషయం వినగానే నర్సయ్య గుండెలు గుభేలుమన్నాయి కారణం వాళ్ళందరికీ సారాపోయిస్తే కనీసం యిరవై రూపాయలు ఖర్చవుతాయి ఆ మొత్తం డబ్బు నర్సయ్య దృష్టిలో తక్కువేమీకాదు

అందుకే సారాకు డబ్బివ్వడానికి అతడు మొదట కొంత తటపటాయించాడు అయితే అది తమ బంధువుల మర్యాదలకు సంబంధించిన విషయం సారా పొయ్యించకుంటే. బంధువులకు మర్యాదలు చెయ్యలేదని తనను దుమ్మెత్తి పోస్తారు అందుకే నర్సయ్య పాతిక రూపాయలు తీసి సారాఖర్చుకు వెంకట్రాముడి చేతికిచ్చాడు

నర్సయ్య యిచ్చిన ఆ డబ్బును చొక్కాజేబులో పెట్టుకుని, వెంకట్రాముడు తిరిగి మామిడి చెట్టు వద్దకు వచ్చాడు వాళ్ళందరినీ ఊళ్ళోని సారాకొట్టువద్దకు తీసుకుపోయి సారాపోయించే బాధ్యతను వెంకట్రాముడికి అప్పగించాడు నర్సయ్య

"వుడుకునీళ్ళు తాగేవోళ్ళంతా నాతోపాటు వూళ్ళోకి రండన్నా పోదాం'– అన్నాడు వెంకట్రాముడు. అతడు అలా అనగానే మామిడిచెట్టుకింద కూర్చున్న వాళ్ళంతా గబగబా పైకిలేచి, ఉత్సాహంగా వెంకట్రాముడి వెంట ఊళ్ళోకి నడిచారు.

(ఇంకా ఉంది)



# తల్లి పాలు బిడ్డకు అన్నిటికీ మించిన పోషకాహారమేకాక ఎంతో మానసిక సంతృప్తిని కూడా కలుగచేస్తాయి

తల్లి పాలు తాగటం వలన మాతా శిశువుల ఆత్మానుబంధం ఎంతో దృఢతరమవుతుంది తల్లి ప్రేమను బిడ్డకు పంచి పెట్టేందుకు యిదే ప్రకృతి సిద్ధమైన పద్ధతి శిశువు సంతోషంగా సంతృప్తిగా పెరిగేందుకు దోహద పడుతుంది

కేవలం తల్లి పాలు మాత్రమే బిడ్డకు కావలసిన పోషకాహారాన్ని, సమపాళ్ళలో అందించ గలుగుతాయి



**మీ బిడ్డను, మీ చనుపాలతోనే పెంచండి. అదే ప్రకృతి నిర్దేశించినది, మీ శిశువుకు కావలసినది.**

కాని ఏదైనా అనుకోని ఇబ్బంది వచ్చినపుడు, అంటే ఏదైనా జబ్బు చేసినప్పుడో, పాలు సరిపడనప్పుడో విజయ స్ప్రేను వాడండి – చక్కగా పరీక్షించబడిన నమ్మకమైన శిశు ఆహారం. మీ బిడ్డ ఆరోగ్యం కాపాడడానికి డబ్బా మీద వ్రాసిన సూచనలను క్షుణ్ణంగా చదివి, అమలు పెట్టండి.

**శిశు సంరక్షణ కొరకై, విజయ స్ప్రే తయారీ దారులైన ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య వారిచే విడుదల చేయబడినది.**

AKSHARA 15986 APDDCFL (Tel)

# పరిష్కారం

"అరుణ"

"ఛ ఛ ఇంట్లో కాలు పెట్టాలంటేనే అసహ్యం వేస్తున్నది ఎప్పుడు చూడు ఒకటే గొడవ అంటూ చేపురించిన ముఖంతో బైటికి వెళ్తున్నాడు రము

అప్పుడే లోపలికి వస్తున్న మాదవయ్యగారు చిన్నపోయిన కొడుకు ముఖం చూసి ఏదో గ్రంధం నడిచిందనుకుంటూనే ఏమయిందిరా రమూ?అప్పుడే బైటికి వెళ్తున్నావు టి అయినా తాగావా అన్నారు

టీ తాగినట్టే వుంది నా బతుకు కడుపు నిండింది, చాలు అంటూ ఆగకుండా బైటికి వెళ్ళాడు

మాదవయ్య లోపల చెప్పులు విడిచి, ఉత్తరియం వంకెకి తగిలించి, పడక్కుర్చిలో వేరగిలపడ్డారు ఎవరైనా కనపడతారేమోనని ఒక నిమిషం చూశారు ఎవరి అలికిడి లేదు అన్నపూర్ణా అని పిలిచారు భార్య పలకలేదు బైటిక రాలేదు 'అమ్మాయ్ రమా' అన్నారు మళ్ళీ

కోడలు పిల్ల రమకు మామగారి పిలుపుకు పలకక తప్పలేదు

టీ తీసుకోండి మామయ్యా అంటూ టీ కప్పు అందించింది

రమ ముఖం చూస్తేనే తెలుస్తున్నది. ఏడ్చి ముఖం కడుక్కున్నదని

ఏం జరిగిందమ్మా అన్నాడు టీ అందుకుంటు

ఏం లేదు మామయ్యా మామూలేగా అంటూ అవతలికి తప్పుకున్నది

ఏమిటి కోడలితో మంతనాలాడుతున్నారు నా మిద చాడిలు చెప్తున్నదా అంటూ వచ్చింది 'అన్నపూర్ణ

ఔనన్నపూర్ణా నీ మిద చాడీలే చెప్తున్నది నేవింటున్నాను సరేనా రమ చాడిలు చెప్పె రకమే ఐతే బాగానే వుండేది

ఔనౌను మి మామాకోడళ్ళు బుద్ధిమంతులు నేను గయ్యాళిని అంతేగా?

చాల్లే ఇంక ఆపు రమూ. నేను రోజూ ఇంటికొచ్చేటప్పటికి నీ అరుపులూ కేకలేగా ఈ రోజు రభస తారస్థాయి చేరి వుంటుంది వాడు టీ చుక్క ఐనా తాగకుండా బైటికి వెళ్ళిపోయినాడు'

అనండి అనండి అందరూ నన్ను అనేవాళ్ళే నేనే




పాపం చేశానో ఐనా నా కోసం ఏమైనా అడిగానుటండి అబ్బాయి ముచ్చట పడుతున్నాడని కోడల్ని ఏమైనా తెమ్మంటాను తప్పా?

ముచ్చట పడుతున్నానని వాడేమైనా నీతో అన్నాడుటే? ఐనా ఈ అనటం ఎన్నిసార్లే? మొదట టి వి అంటివి ఇంకోసారి రేడియో అంటివి మరోసారి పాన్ అంటివి మిక్సరంటివి ఇప్పుడు మళ్ళీ రెఫ్రిజిరేటర్ తెమ్మంటివి వాళ్ళేమైనా తక్కువ చేశారా? పెళ్ళికి మంచాలతో సహా అన్నీ ఇచ్చే పంపించారు కదా నీవు కోరినట్టే కట్నం పోసి, లాంచనాలన్నీ జరిపారె ఎప్పుడు చూడు నీ పెళ్ళాన్ని అది తెమ్మను, ఇది తెమ్మను లేకపోతే పుట్టింట్లోనే వుండమను అని వాడినెందుకే వేదిస్తావ్?

ఏం తెమ్మన్నానని? వాళ్ళేమైనా లేనివాళ్ళా? ఎల్లల ముద్దు ముచ్చట తీర్చుకర లేదా?

ఆ మాట ఎవరన్నారు? వాళ్ళం తీర్చటం లేదా నువ్వు అడగటానికి ఐనా ఎదిగిన ఆడపిల్ల పుట్టింటికి వెళ్ళినప్పుడల్లా నాకది కావాలి ఇది కొని పెట్టు అని ఏమడుగుతుందే అన్నపూర్ణా? నీకా జ్ఞానం లేదా? అది సరే కాని అన్నపూర్ణా నీ పుట్టింటి నించి నీ వెన్ని సార్లు ఏమేం తెచ్చావో తెలియక అడుగుతున్నా కాని చెప్పు

సర్లేండి సంబడం నన్నిప్పుడు సాదించాలని బుద్ధి పుట్టిందా' మీకు అడగటం చేతకాదు నన్ను

అడగనివ్వరు మీరు వూరుకోండి చాలు

రాత్రికి రఘు లేటుగా వచ్చాడు ఇంటికి తండ్రి భోజనం చెయ్యకుండా తన కోసం కాచుకుని కూర్చోవటంతో తప్పని సరిగా పంక్తిన కూర్చుని లేచాడు మాదవయ్య ఉసూరుమన్నాడు తిన్నది నిరు కోరిపోయింది

వంటిల్లు సర్ది రమ గదిలోకి వెళ్ళింది రఘు ఆలోచనలో వున్నాడు రమ లేని వుత్సాహం తెచ్చుకుని 'ఏమిటండి ఆలోచన' అంది

ఏం లేదు రమా అసలు ఈ రోజు అంత గొడవ ఎందుకయింది?

కొత్తేముంది మా దిన చర్యేగా పోనిద్దురూ అంది నిర్వికారంగా

అదికాదు రోజూ నిన్ను పుట్టింటికి పొమ్మంటుంది నన్ను పంపించెయ్యరా అని అంటుంది ఇప్పటి కొత్త కోర్కె ఏమిటిట?

ఏముంది ఫ్రిజ్ మీద మనసు పోయింది నన్ను తెమ్మంటుంది

'నాన్నా నేను సంపాదిస్తున్నాం కదా మాకు చెప్తే మేము కొనమా? దానికి నిన్ను నీ వాళ్ళింటికి పొమ్మనటం దేనికి?

నా కర్మ అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది రమ

'నేను నిన్నేమైనా అంటే పోనీ నీవు బాదపడవచ్చు అంతే కాని ఇదేమిటి? కళ్ళు తుడుచుకో దీనికేమైనా మార్గం ఆలోచించాలి అన్నట్టు ఆ పెట్టెలో మన స్కూటర్ ఫండు ఎంత వుందో చూడు

ఆరు వేల ఎనిమిది వందలు వుందండి

ఐతే సరే. రేపొద్దున నాకా డబ్బివ్వు'

ఏం చేస్తారు?

'చూస్తావుగా ఇంక పడుకో

మర్నాడు తండ్రికొడుకులు భోజనం చేసి బయల్దేరుతూ రఘు డబ్బు తెచ్చి 'అమ్మా ఇదుగో ఆరు వేల ఐదు వందలు అని తల్లి చేతికి ఇచ్చాడు

దేనికిరా అబ్బాయ్ అంటూ తల్లీ తండ్రి ఇద్దరూ అడిగారు

రమను అమ్మ పుట్టింటికి వెళ్ళి ఫ్రిజ్ తెమ్మందిట అది అమ్మే కొనుక్కోవచ్చు అని

"అదేమిట్రా నాయనా. "

మాధవయ్య ఆ మాటకు అడ్డు వస్తూ అన్నపూర్ణమ్మ "ఓహో ఇదంతా కోడలి నిర్వాకం కాబోలు నేనేం డబ్బులేక దాన్ని అడగలేదు మహా గొప్పవాడివే నీ డబ్బు నాకేం అక్కర లేదు నాయనా నువ్వే వుంచుకో" అంటూ చేతిలో పెట్టేసి 'ఇదిగో రమా నీ ఆటలిక్కడ సాగవు ఏమనుకున్నావో మేమేమి లేక చావటం లేదు ఇవన్నీ కావాలంటే మేము కొనుక్కోగలం. కాని ఏదో ముద్దూ ముచ్చటా . ఇంక చాల్లే అవవే ఇంకొకళ్ళని అడిగి కొనిపించుకోవటం ఏం ముద్దే, ఏం ముచ్చటే? అది దేచిరించటం కాదు? ఆడపిల్ల పుట్టింటికి వెళ్ళినప్పుడల్లా నాకది కావాలి, ఇది కావాలి అని ఎట్లా అడుగుతుందే? సిగ్గుగా వుండదు? ఆలోచించవు ఎందుకని?

"చాల్లేండి మీ ధర్మపన్నాలు నేనడిగింది తెచ్చి తరాల్సిందే లేకపోతే పుట్టింట్లోనే వుండమని అనండి

నే చెస్తే కాని ఈ ఎడ విరగడ కాదు అంటూ రఘు బైటకి వెళ్ళాడు

రఘూ రఘూ అంటూ మాదవయ్య వెంటపడ్డాడు ఆగకుండా పోతున్న రఘుని సందు మలుపులో కలుసుకుని ఒరే రఘూ సాయంత్రం ఐదింటి కల్లా నేను నీ ఆఫీసుకు వస్తా ఓ పది నిమిషాలు అటూ ఇటూ ఐనా వుండు

దేనికి నాన్నా అంటున్నా వినిపించుకోకుండా మాదవయ్య వెళ్ళిపోయినాడు

ఆ రోజు తండ్రి కొడుకులిద్దరూ కలిసి రాత్రి తొమ్మిది అవుతూ వుండగా ఇంటి కొచ్చారు వాళ్ళ కోసం అన్నపూర్ణమ్మ బైట వరండాలో రమ లోపల హాల్లో ఎదురు తెన్నులు చూస్తున్నారు

ఈ రోజు ఇంత లేటయిందేమిటండి పైగా ఇద్దరూ కలిసి కూడా వచ్చారు ఏమిటి వ్యవహారం?

ఏం లేదు అన్నపూర్ణా రేపు ఆదివారం కదా రేపటి కార్యక్రమం తీరికగా ఆలోచించుకుంటూ కూర్చుంటే పొద్దు పోయింది అన్నాడు మాదవయ్య లోపలికి నడుస్తూ

రఘూ, రమా ముఖాలు చూసుకున్నారే తప్ప మాట్లాడలేదు

తెల్లవారింది నిత్యకృత్యాలైనై భోజనాలై తిరిగ్గా హాల్లో కూర్చున్నారు తండ్రి కొడుకులు రఘు చేతిలో పెన్ను, కాయితాలు వున్నై

ఆఁ ఇంక చెప్పు నాన్నా మన కార్యక్రమం వేసుకుందాం

సరే రాసుకోరా

ఏమిటండి కార్యక్రమం అంటున్నారు అంటూ వచ్చింది అన్నపూర్ణ

ఇది మా స్వవిషయం నువ్వు నోరు మూసుకుని కూర్చో, కావాలంటే విను, అంతే ఆఁ రాసుకోరా రఘూ

ఒకటి – పొద్దున అయిదింటికి నీవు పాలు తేవాలి

రెండు – నేను నీళ్ళు పడతాను

మూడు – తరవాత నీవు కాపీ చెయ్యాలి

నాలుగు – నేను స్నానానికి నీళ్ళు కాస్తాను

ఐదు – నీవు కూరలు తరిగి, బియ్యం కడిగి ఇవ్వు,

ఆరు – నే వంట చేస్తాను

ఏడు – నీవు ఇల్లు చిమ్ము

ఎనిమిది – నేను బట్టలు వుతుకుతాను గిన్నెలు తోముతాను. భోజనం చేసి ఇద్దరం ఆఫీసుకి వెళ్దాం

నాన్నా పని మనిషిని తీసేద్దాం అంటావా?

అదేమిటండి పని మనిషిని తీసే

అన్నపూర్ణా నువ్వు నోరు మూసుకుని కూర్చోవాలని ముందే చెప్పానా? ఒరే అబ్బాయ్ ఇద్దరం మగవాళ్ళం ఆ పనిమనిషి ఏమి ఎత్తి కెళ్తుందో ఏం యాగి చేస్తుందో అని సాయంత్రం ఇద్దరం హొటల్లో కాఫీ తాగివద్దాం దోవలో కూరలూ అవి తెచ్చుకుందాం రాత్రికి అన్నం వండి, ఏదో వేపుడు కూర నువ్వు చెయ్యి సరిపోతుంది

"సరే నాన్నా అట్లాగే'



ఆ ( శలవల్లో ఇద్దరం హాయిగా హొటల్లో తిందాం కావాలంటే వండుకుందాం సరే ఈ కార్యక్రమం సెటిలయింది ఇంక అటక మీద పెట్టెలు దించరా రఘూ

అటక మీది ఆ పాత పెట్టెలెందుకండీ ఇప్పుడు?

ఇదుగో ఇది మా వ్యవహారం అని ముందే చెప్పాను నువ్వు నోరు మూసుకుని వుండు

ఇదెక్కడి వ్యవహారమండీ అంటూ నోరు తెరుచుకుని కూర్చుంది అన్నపూర్ణమ్మ

అమ్మాయ్ రమా ఆ పెద్ద స్టూలు తీసుకురామ్మా వచ్చి ఇక్కడ నుంచో రఘు పెట్టెలు అందిస్తాడు దించుదాం మనం అట్లా చూస్తావేమిటమ్మా కొంచెంసేపు వుండు అంతా నీకూ అర్థమౌతుంది

ఒరే అబ్బాయ్ ఆ పెద్ద నల్లపెట్టె దించరా దాని పక్కన ఆగ్రేది, దాని పక్కనే వున్న ఆ పచ్చది మూడూ దించు అమ్మాయ్ రమా గట్టిగా పట్టుకో ఆ ( క్రిందికి దించమ్మా, నేను పెద్దముండావాణ్ణి, అటే బరువు పట్టలేను ఒరే రఘూ ఈ మూడూ పెద్దవే కదా ఇవి అమ్మాయ్ రమకి సరిపోతైరా ఆ వెనక వున్న టి ఐ. ఫాన్ అట్టపెట్టెలు మెల్లగా దించు ఏమ్మా నీ సామాన్లకు ఇవి సరిపోతయ్యా? అదేమిటమ్మా అట్లా తెల్లబోయి చూస్తున్నావు? నిన్ను నీ అత్తగారి మాట ప్రకారం పుట్టింటికి పంపించాలనుకుంటున్నాం అబ్బే అదేమిటమ్మా కళ్ల నీళ్లెందుకు? ఇంకో రెండు నిమిషాలు ఆగమ్మా

# "పరిష్కారం"

ఒరే రఘూ మీ అమ్మకు ఆ పాత చిన్నపెట్టె దించరా అసలు అంత పెట్టె కూడ అక్కర్లేదేమో కదే అన్నపూర్ణా, ఒ సంచీ చాలు. పోనీలేరా ఆ పెట్టె దించు

నాకు పెట్టె ఏమిటండీ" కోడలుకి అన్ని పెట్టెలు దింపించారేమిటండి? అసలు

చెప్తాను తొందరపడకు ఒరే రఘూ పెట్టెలు దించటం చాలు ఇంక దిగరా అబ్బాయ్ అమ్మాయ్ రమా నీ సామాన్లన్నీ సర్దుకోటానికి ఈ పెట్టెలు సరిపోతై కదమ్మా కావాలంటే వేరే చూస్తాలే ఒరేయ్ మీ అమ్మకి ఇంత పెట్టె అనవసరంరా దించటం బరువు చేటు అసలు మీ అమ్మ నా ఇంటికి వచ్చినప్పుడు రెండో మూడో. కట్టుడు చీరలు తప్ప వేరే ఏమి తెచ్చుకోలేదురా అవి ఇన్నేళ్లు వుంటయ్యా ఎప్పుడో చిరిగిపోయినై మీ అమ్మ మన రమ లాగా పుట్టింటి నించి కట్నకానుకలు, లాంఛనాలతో రాలేదుర్రా. పూచిక పుల్ల కూడా తీసుకు రాలేదంటి నమ్ము. అందుకని ఆమె తిరిగి సర్దుకోవలసినవి బొత్తిగా ఏమి లేవు అన్నీ నేను కొనిపెట్టినవే అవి తీసికెళ్తే నేను కాదననుకో "

అయ్యో అయ్యో ఏం మాటలండీ అవి? మీకేమైనా మతిపోలేదు కదా?" అంటూ గొంతు పూడుకుపోయి, ఏడుపు ఆపుకుంటూ కళ్లు తుడుచుకోవటం మొదలుపెట్టింది

రమ తన ఏడపు మరిచిపోయి నోరు తెరుచుకుని చూస్తున్నది

ఏడుస్తూనే అన్నపూర్ణమ్మ నేను పెట్టె సర్దుకుని వెళ్లిపోవటం ఏమిటండి ఇదెక్కడి కర్మరా భగవంతుడా' అంటూ స్వరం పెద్దది చేసింది

హుష్ నోరు మూసుకోమని ఇంకోసారి చెప్తున్నాను నీ ఏడుపు వినపడ్డదంటే కొట్టి మరి వున్నదాన్ని వున్నట్టు బైటికి నెట్టి తలుపు వేస్తాను ఏమనుకున్నావో ఏడుపు ఆపి నీవు నీ పుట్టింటి నించి తెచ్చినవి ఏమైనా వుంటే గుర్తు తెచ్చుకో'

నా కర్మ కాలింది దేవుడో, నేను లేని ఇంటి నుంచి కట్టుబట్టలతో వచ్చానని చెప్పటానికి ఇన్నేళ్లు పట్టిందిటండి?'

ఔనే అన్నపూర్ణా ఇన్నేళ్లు అన్నీ సహించాను ఇంక నా వల్లకాదు అందంగా వున్నావని ఇష్టపడి కానీ కట్నం లేకుండా నిన్ను చేసుకున్నాననే కదూ నీకీ మిడిసిపాటు నీ పుట్టింటి నించి అప్పుడెట్లా వచ్చావో ఇప్పుడు అట్లాగే వెళ్లు "

"అయ్యో భగవంతుడా ఇప్పుడు నాకు పుట్టిల్లేమిటండి? నేనెక్కడికి పోనండీ ..

"నీకు దిక్కున్న చోటికి పో. . ఒరే రఘూ నిన్న కొన్న రైలు టిక్కెట్లు ఇట్లా ఇవ్వు అమ్మాయ్ రమా ఇదీ నీది అన్నపూర్ణా ఇది నీది. తీసుకోండి ఇకనించి ఈ ఇంట్లో నేను రఘూయే వుంటాం అన్నపూర్ణా నీకు నెలకు రెండు వందలు పంపుతాను నీ పుట్టింటో నీ వుండు నీకు ఆటే ఖర్చులుండవు కనక అది






మాటలకు మౌనానికి
మధ్య మధురక్షణాలు
ఏదియేమయినా ఫరవాలేదనుకొనే మధుర క్షణాలు
మీ జీవితంలో ఎన్నో. మౌనసామ్రాజ్యం వాడిలో
ఉద్వేగపూరితమైన నవ్వుతో—ఏకమైన వేళ.
ఇంకెవ్వరూ, కాదు ఈ ప్రపంచమే ఏమైనా ఫరవా
లేదు నిజమే. మీకు ఈ మధుర క్షణాలకు మధ్య
ఏదీ అడ్డురాకుండా ఉండేందుకు అవసరమైనది
కోహినూర్ లేత ఎలుపు మీ మృదువైన ఆలో
చనలకు సున్నితత్వానికి రక్షణనిస్తుంది. శ్రేష్ఠమైన
లేటెక్స్‌తో తయారుచేయబడినది. పూర్తి రక్షణ
నివ్వడానికి ఎలెక్ట్రానిక్ సాధనాలతో పరీక్ష చేయ
బడినది. మృదువుగా ఉండేందుకు ల్యూబ్రికేట్
చేయబడింది.
KOHINOOR
సరికొత్త ప్యాకింగ్‌లో ముచ్చటగా మూడు
లేత ఎలుపు సుకుమారమైన కండోం
ttk తయారి.

# ఈ వేమన పద్యాలు




## "పరిష్కారం"

చాలనుకుంటున్నాను అమ్మాయ్ రమా నీకు అబ్బాయ్ నెలకు మూడు వందలు పంపిస్తాడు నువ్వు ఇంకా చిన్నదానివి చదువుకుంటానంటే చెప్పు నీ కాలేజి ఖర్చులు భరిస్తాడు ఈ రోజు ఇరవై ఆరు మీరు ముప్పైవ తారీకు రాత్రి బయల్దేరి వెళ్ళాలి ఆ రోజు మాకు జీతాలు అందుత్తై మీకు డబ్బిచ్చి పంపుతాం ఈలోగా మీ సామాన్లు సర్దుకోండి అవసరమైనది ఏమైనా వుంటే చెప్పండి తెచ్చిస్తాం.

ఈ తడవ అన్నపూర్ణ పెద్దగా ఏడుస్తూ "అయ్యో ఇదేమిటండీ ముప్పై ఏళ్ళు కాపరం చేసిన నన్ను వెళ్ళిపొమ్మంటారేమిటండీ? . ఇదేం న్యాయం?ఎక్కడికి వెళ్ళనండి అంటూ ఏడుపు లంకించుకుంది

'మాకు మాత్రం సరదాటే అన్నపూర్ణా? రమను విడిచి రము మాత్రం వుండగలడా? కాని ఏం చేస్తాం చెప్పు? తప్పదు మరి ."

నేనేమైనా తప్పు చేసి వుంటే చెప్పండి. లెంపలు వేసుకుంటాను అంతే కాని ఇంత శిక్షా, ఇంత శిక్షా ఓరి భగవంతుడా

'అవు, చేసింది చాలు టిక్కెట్లు తెచ్చాం మీ ఏర్పాట్లన్నీ చేశాం బాంక్‌లో అవసరానికి వుంటుందని మీ పేర డబ్బు వేశాం అన్నీ జరిగిపోయినై ఇంక '

ఏమైనా సరే నే చావనైనా చస్తా కాని అడుగు బైట పెట్టను. ఒరే రమూ నీ మాట కూడా ఇదేటరా? . చెప్పరా?

ఏం చెప్పేదమ్మా రోజు మీరు నా ప్రాణం తినేస్తున్నారు ఇద్దరి మధ్య నలిగి చస్తున్నాను మూడు నెలల కోసారి నువ్వు రమని పుట్టింటికి పొమ్మంటావ్ ఏదో తెమ్మంటావు అదేమో ఇంకా ఎన్నేళ్ళు నా పుట్టింటిని పీక్కు తినమంటారని ఏడుస్తుంది చెప్తే నువ్వు వినవు అది నీ లాటి ఆడదే కదా నీ లాగానే ఈ ఇంటి కొచ్చిన కోడలు ఇప్పటికే ఎన్నో తెచ్చింది ఇంకా నీవు దాన్ని వేధిస్తుంటే అది మాత్రం ఏం చేస్తుంది చెప్పు? నీవు ఇల్లొక నరకం చేస్తున్నావ్. అందుకని ."

'ఆఁ , అందుకని ఏమిట్రా చెప్పు."

'నే చెప్తా వినవే రఘు నీ గోల భరించలేక సన్యాసుల్లో కలిసి పోతానంటూ ఇల్లు విడిచి వీధిన పడ్డాడు వాడికి మీ ఇద్దర్ని పంపించి వేసి మనం ఇద్దరం వుందాంరా అని నచ్చచెప్పి వప్పించి ఇంటికి తీసుకుని వచ్చేటప్పటికి తలప్రాణం తోకకొచ్చింది. ఇదొక్కటే మార్గంగా తోచింది అందుకే మీరిద్దరూ ప్రయాణానికి సిద్ధంకాండి. గుర్తుందా అన్నపూర్ణా ముప్పై రాత్రికి ప్రయాణం, టిక్కెట్ జాగ్రత్త"

అన్నపూర్ణమ్మ ఆ టిక్కెట్ ఆయన చేతుల్లోనే పెట్టి రెండు చేతులు గట్టిగా పట్టుకుని ఏడుస్తూ "నాకు బుద్ధొచ్చిందండీ ఇంకెప్పుడు ఇలాంటి అవివేకపు పనులు చేయనండీ. ఒరే రఘూ నీ మీద ఒట్టురా నిన్ను నేను బాధ పెట్టనురా రమని కూడా కన్నబిడ్డ లాగా చూసుకుంటానురా బాబూ అమ్మాయ్ రమా నా మాట నమ్మమ్మా ఇంక నిన్ను వేధించను మీరందరూ నన్ను ఒక్కసారికి క్షమించండి" అంటూ నిజమైన పశ్చాత్తాపంతో గుండెలవిసేట్టు యాడవటం సాగించింది

అది చూడలేక మాధవయ్య ఏమిట్రా రఘూ మీ అమ్మ ఆ వరసన ఏడుస్తున్నది ఏం చేద్దాం అంటావు? .

నాదేముంది నాన్నా రమని అడుగు "

'ఏమ్మా రమా ఏమంటావ్?

"మీ ఇష్టమే నా ఇష్టం మామయ్యా "

"సరే అన్నపూర్ణా కానివ్వు. నీకొక ఛాన్సు ఇస్తున్నాను ఏ పేచీలు లేకుండా సరిగ్గా వుంటే మాకభ్యంతరం లేదు మళ్ళీ మొదటి కొచ్చావో ఈసారి నిన్ను పంపించను నేనూ వాడూ సన్యాసుల్లో కలిసిపోతాం తరవాత మీ పాట్లు మీరు పడాలి.'

'ఒరే అబ్బాయ్ ఈ పెట్టెలు పైన పెట్టెయ్యరా "

"ఇప్పుడు కాదు నాన్నా కాస్త రెస్ట్ తీసుకుని వస్తానంటూ రమతో పాటు గదిలోకి వెళ్ళిపోయినాడు కొంత సేపటికి వాళ్ళ గదిలోంచి నవ్వులు వినపడ్డై

నాలుగు గంటలకి టిఫిన్ తిని అందరూ మళ్ళీ పెట్టెల దగ్గర చేరారు పెట్టెలు అందిస్తున్నది రమ అయ్యా కొడుకులు కలిసి ఆడిన నాటకం తెలిసిందో ఏమో రమ ముఖం వెలిగిపోతున్నది అన్నపూర్ణమ్మ మాత్రం బలవంతాన నవ్వుతున్నది. సమస్యని అంత తేలికగా పరిష్కరించ కలిగినందులకు మాధవయ్య రము తృప్తిగా నవ్వుకున్నారు □


మీవారికొచ్చిన జబ్బేమీ లేదమ్మా! ఊరు చివర
ఇల్లు కట్టాల్సివచ్చిందని మనోవ్యధ చెందుతున్నారు!
మీ ఇంటిని నాగార్జున సిమెంట్‌తో కట్టుకుంటే
ఎక్కడున్నా నిర్భయంగా వుండొచ్చు!
దిగులే వుండదు!
డాక్టర్ అభయానంద్ MBBS
నాగార్జున సిమెంట్
MAM-18

పడేశాయి' అది చెప్పటం వల్ల అమె కంగారు పడుతుంది ఆ భయం వల్ల అమె ఇక ముందుకు రానంటే నాకూ పర్వతారోహణలో ఆసక్తి పోయి, నేనూ అమెతో పాటే తిరిగి వెళ్ళిపోదామనుకుంటాను ఇవన్నీ ఆలోచించే నేను వెంటనే ఏం చెప్పలేదు అవంతిని చెయ్యి పట్టివేసి "ముందు మనం ఈ లోయలోపలి నుంచి పైకి చేరాలి!" అన్నాను, నా చిన్న టార్చి లైటు నేను జారుతూ వచ్చిన వేపు వేస్తూ

అవంతి నాతో పాటే బయలుదేరింది'ఇద్దరం ఆ కందకంలాంటి లోయలో నుంచి పైకెక్కడానికి నేను గొడ్డలితో మంచు గోడలో కన్నాలు పెట్టాను ఆ కన్నాల్లో కాళ్ళు పెట్టి నేను దిగుడు బావిలో నుంచి పైకి వచ్చినట్టు రావాలని నా ఆలోచన' చినిగిపోయిన టెంట్ తాళ్ళు గొడ్డలితో నరికి వాటి చివర్లు ముడి వేసి ఒక చిన్న తాటిమోకులా తయారు చేశాను

ఈ పనిలో అవంతి సహకారం వుండటంతో నాకెక్కువ శ్రమ అనిపించలేదు

నేను మంచు గోడలో తొలిచిన కన్నాల్లో కాళ్ళు పెట్టి పైకెక్కుతూ, నాకు చేతికి గట్టి పట్టు, చిక్కటానికి గొడ్డలితో నరుక్కుంటూ నాలుగైదు గంటలు తిప్పలు పడి పైకొచ్చాను' నా నడుముకున్న టెంట్ తాళ్ళు వూడతీసి సమతలంగా వున్న ఒక పెద్ద బంత రాయికి కట్టి రెండవ కొసతో అవంతిని రమ్మనమని జార విడిచాను

అవంతి అసలే నీరసంగా ఉండటంతో ఆ తాడు ఆధారగా పైకి రాలేకపోతోంది.

చివరికి, ముందు పైకి రావటానికి నేను చేసిన గుంటల్లో కాళ్ళు పెట్టి ఎలాగో పైకి వచ్చింది. అప్పటికి బాగా తెల్లవారిపోయింది

అయితే మేమిద్దరం వూహించని పరిసిత్థితి అక్కడ మాకు దిగ్భ్రమ కలిగించింది!!

అవంతి చనిపోయిందని అమె మృత దేహాన్ని తేబోయిన నేనూ ఆ ప్రయత్నంలో చనిపోయి వుంటానని తలచి మా పర్వతారోహణ బృందం అక్కడి నుంచి వెళ్ళిపోయింది

కాంచనగంగ, నందనదేవి - పర్వతాగ్రాలు చేరటానికే వాళ్ళు ముందుకు వెళ్ళి వుంటారని అనుకున్నాను

అయితే అదెంత ప్రమాదమో నాకు తెలుసు వాళ్ళు చేరవలసిన చోటు- ఇంకా నాలుగుమజిలీలు వేస్తేనే కాని రాదు!

మేము వాళ్ళతో వెళ్లాలంటే అసాధ్యం!

వాళ్ళు ఏ తెల్లవారు ఝామున నాలుగింటికో బయలుదేరి వుంటారు!

మూడు గంటల్లో వాళ్ళు ఒక మేజిలో దాటిపోయి వుంటారు

ఎండ పడ్డకొద్దీ పగలు ప్రయాణం పైకి సాగదు! మంచు ఎండ వేడికి కరుగుతుంటుంది

అందుకే పర్వతారోహణ రాత్రి-తెల్లవారుఝామున అక్కడ చేయవలసి వుంటుంది పగలు చేసే ప్రయాణం ముఖ్యంగా సూర్యోదయం తరువాత జరిగేది ఎక్కువ ప్రమాదకారి!

మేమూ వాళ్ళతో వుండి వుంటే-టిన్‌ఫుడ్- టీ నీళ్ళు- విస్కీ బాటిల్స్ పుష్కలంగా వుండటం వల్ల ప్రయాణంలో అహార సమస్య వుండదు!

అన్నిటినీ మించి- పర్వతం పైకెక్కేకొద్దీ ప్రాణ వాయువు పెద్ద సమస్య!" నా ఆక్సిజన్ సిలిండర్ ఖాళీ అయ్యింది ఆ ఆక్సిజన్ సిలిండర్లన్నీ వాళ్లే ఎత్తుకెళ్లారు నన్ను అవంతితో చావమని వాళ్ళలా చేశారని వూహించాను!

ఆ విషయం అవంతికి అర్ధమై వుంటుందనుకున్నాను

'మనం ఒకవేళ తిరిగి వచ్చినా మనని తిరిగి క్రిందికి వెళ్ళిపొమ్మనే వీళ్ళిలా చేశారు!' అంది అవంతి

ఆ పరిస్థితుల్లో అంతకంటే చేయగలిగింది లేక మేమిద్దరం క్రిందికి ప్రయాణమయ్యాము

'మనం రాజామహేంద్రగారు కోరినట్టు . కాంచనగంగ పర్వతం మీద నేపాల్ జండాని ప్రతిష్ఠించకుండా వస్తే దేశాన్ని అవమాన పరచినట్టు అనుకుంటారేమో!?' అంది అవంతి, తన భయాన్ని వ్యక్తం చేస్తూ

'మనం ఏ పరిస్థితుల్లో తిరిగి వచ్చామో చెబితే మనను క్షమించరా? అన్నాను

కాని అవంతి నా వేపు భయంగా చూస్తూ 'ఇక్కడి లామాల సంగతి మీకు తెలియదు! మహారాజు వీడ్కొలిచ్చిన బృందం, మహారాజు కోరిక తీర్చకుండా తిరిగి వస్తే వాళ్ళను శిక్షిస్తారు!" అంది నాకు ఆ మాటలతో మతిపోయింది

"అందుకనా మహిపాల్, జగదీష్, ప్రతాప్ రఘువీర్ అలా ముందుకు సాగింది! అన్నాను అయోమయావస్తలో పడి

మనం నేపాల్ భూభాగాన్ని తాకటానికి క్రిందకి దిగుతున్నామంటే శిక్షా ప్రమాదానికి అంత దగ్గరగా సమీపిస్తున్నామన్న మాట!" అంది అవంతి



# బలికోరిన ప్రేమ

అవంతి ఆంధ్ర యువతి అయినా చాలా ఎళ్ళుగా తండ్రి ఉద్యోగ రీత్యా నేపాల్ ప్రాంతంలో వుండటం వల్ల ఆమెకు ఆ పర్వతారోహక బృందాలు పాటించవలసిన నియమాలు తెలుసు! నేను కొత్తవాణ్ణి నాకు ఈ వివరాలు తెలియవు! పైగా బౌద్ధబిక్షకులైన లామాలు అహింసామూర్తులు గదా వాళ్ళు మనుషుల్ని శిక్షిస్తారా? అలోచిస్తూ చివరికి–

అయితే ఇప్పుడు ఎం చేయాలి? అన్నాను అవంతితో నే

మనం ఇక నేపాల్‌కు వెళ్ళకుండా ఎట్లైనా తప్పించుకుపోవాలి! అంది అవంతి

ఆ మాటలతో నా గుండె ఆగి మళ్ళీ కొట్టుకున్నట్లనిపించింది!

నేపాల్ ప్రాంతంలో లేకుండా తప్పించుకుని ఇతర ప్రాంతాలకు వెళితే శిక్షించరా? అన్నాను

లామాల అదికారం – నేపాల్ టిబెట్ భూటాన్ లాంటి ప్రాంతాలలోనే అమలు జరుగుతుంది! పేరుకు రాజొకరున్నా ఈ మతాధికారులే వెనక వుండి యంత్రబోద చేస్తుంటారు! అంది నేను ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాను!

ఇందుకు ఒక ముఖ్య కారణం నేను శాంతినికేతన్‌లో నాలుగేళ్ళుగా చదివిన ఫైన్ ఆర్ట్స్ మాస్టర్ డిగ్రీ తీసుకోకుండా వెళ్ళవలసి వస్తున్నదే అనే బాధ వుంది

అయితే ముందు నాతో పాటు అవంతికి శిక్షపడకుండా కాపాడటం ముఖ్యం!

మరో మార్గం లేక ఇద్దరం తిరుగు ప్రయాణమయ్యాము

కొంత దూరం వచ్చేప్పటికి నా వీపుకున్న ఆక్సిజన్ సిలిండర్‌లోని ప్రాణవాయువు ఎమీ మిగలకుండా పూర్తయిపోతున్నట్లనిపించసాగింది!

మనం త్వరగా క్రిందికి వెళ్ళిపోవాలి! ఇక ఒక్క నిముషం మనం వృదా చేయటానికి లేదు! అన్నాను అవంతితో

కొంతసేపు నేను – కొంతసేపు అవంతి ఆక్సిజన్ సిలిండర్లు మార్చుకుంటూ ఎలాగో వస్తున్నాము

ఇంకో మజిలీ దాటితే మనకిక ఆక్సిజన్ సిలిండర్లతో పని లేదు! అంది అవంతి

ఇంకో మూడు గంటల ప్రయాణం చేస్తేనే కాని మన గమ్యం రాదు! అన్నాను నేను ఆమెకు చేయి అందిస్తూ

మనం మొదటి మజిలీ నుంచి ఎయలుదేరేప్పుడు జగదిష్ ప్రతాప్ రఘువీర్ నా బుగన ముద్దు పెట్టుకున్నారు గుర్తుందా? అడిగింది అవంతి

నేను ఆ చాన్సుకు నోచుకోలేదు! అన్నాను నేనువెంటనే

అది అశుబ సూచకం!! మన సామానులు మొదటి మజిలీ వరకు మోసిన




షెర్పా కూలీలు వాళ్ళ బాషలో ఆ విషయం గుసగుసలుగా అనుకుంటుండటం నేను విన్నాను ' అంది అవంతి

నేను విన్నా అది నమ్మను! ఆటవిక దశలో యింకా వున్న ఈ కొండమనుషుల మూడనమ్మకాలు నువ్వు నమ్ముతావా డియర్! అన్నాను నేను

మనం చివరి మజిలీ చేరగానే పర్వతారోహకులు వెళ్ళే దారి కాకుండా మరో దారిన పోదాం! లేకపోతే మనకు ప్రమాదం పొంచి వుంటుంది అంది అవంతి

నేను అలాగేనని అయితే అవంతీ! ఎక్కడికి పారిపోదాం!? అన్నాను

నేను ఆంధ్రా చూసి చాలా ఎళ్ళయింది " మీరు వైజాగ్ నివాసులే గదా "అక్కడికే వెళదాం! అంది అవంతి

నాకు ఆమె సూచన ఎంతో ఆనందం కలిగించింది అయితే మేమిద్దరం వూహించనట్లు మొదటి మజిలీ దగ్గర మహిపాల్ ఒక్కడే మా ఇద్దరి కోసం ఎదురు చూస్తూ కనిపించాడు! అతనితో పాటు నేపాల్ పోలీసు అదికారులున్నారు!!

మా ఆశ్చర్యానికి అంతులేదు!

తక్కిన వాళ్ళేరి? మీ రెప్పుడొచ్చారు!? ఎలా వచ్చారు? అన్నాను నేను సంభ్రమాశ్చర్యాలతో మహిపాల్‌తో

వాటికి నా కంటే మీకే సమాదానాలు బాగా తెలుసు! చూస్తారేం బందించండి దుర్మార్గుణ్ణి " వీడే జగదిష్ ప్రతాప్ రఘువీర్‌లను పొట్టను పెట్టుకుని నాటకం ఆడుతున్నాడు! అన్నాడు కోపంగా మండిపడుతూ

ఏమిటి మహిపాల్!!? ఎమిటి మీరు చెప్పేది ? అన్నాను ఇంకా అమాయకంగా

చూశారా!! ఈ దుర్మార్గుడు ఎంత ఘోరం చేసి ఇంకా అమాయకుడుగా నటిస్తున్నాడో!? వీడిని ఊరికే వదల కూడదు! అంటున్నాడు పోలీసు అదికారుల్ని నా మీదకు రెచ్చగొడుతూ మహిపాల్

ఎమిటి మహిపాల్ జగదిష్ ప్రతాప్ రఘువీర్‌లు ఏరి? !? అన్నాను మళ్ళీ

వాళ్ళ సంగతి నా కంటే నీకే బాగా తెలుసు!! వాళ్ళేం ద్రోహం చేశారని వాళ్ళను హతమార్చి అంత మిత్రద్రోహం చేశావు?!? వాళ్ళ ఈ రక్తసిక్త దుస్తులు చూస్తుంటే యింత ఘోరంగా వాళ్ళను నిద్రలో వుండగా చంపిన నిన్ను ఎంత క్రూరంగా చిత్రవద చేసి చంపితే అది సరిపోతుంది! అన్నాడు నా వైపు నిప్పులు కక్కుతూ అప్పడే చూశాను అక్కడ జగదిష్ ప్రతాప్ రఘువీర్‌లు ధరించిన ఉన్ని కోట్లు రక్తంలో తడిసి రంగు మారిపోయి గుర్తు పట్టటానికి వీలు లేనట్లుగా ఒక మూటలా పడి వున్నాయి

వాళ్ళను నేనేం చేయలేదు!! అసలు నేను అవంతి కోసం లోయలోకి దిగి అవంతితో తిరిగి వచ్చేప్పటికే మీ బృందం లేదక్కడ! ఇక నేను వాళ్ళ నెలా చంపుతాను! అన్నాను అమాయకంగా

నీ మీద నిందారోపణకు తగిన సమాదానాలు చెప్పి నీ నిర్దోషిత్వం రుజువు చేసుకోవలసింది కోర్టులో ఇక్కడ కాదు కమాన్! అన్నాడు పోలీస్ ఆఫీసర్ నన్ను బందించమని పోలీసులకు చెబుతూ అదంతా ఎమిటో మహిపాల్ అలాంటి ఆరోపణలు ఎందుకు చేశాడో నన్ను పోలీసులు మూడు హత్యలు చేసిన హంతకుడిగా ఎందుకు నిర్బందంలోకి తీసుకుంటున్నారో అవంతికేమి అర్ధంకాలేదు

ఆమె నావేపు బయంగా అనుమానంగా ఇంకా నమ్మ లేక అలా చూస్తూవుండి పోయింది

క్షణాల్లో నన్ను నేపాల్ పోలీసులు పెడరెక్కలు విరిచి కట్టి బందించారు

ఎమిటీ ఘోరం "నన్ను బందించారేం నేను ఎం పాపం ఎరగను" వీళ్ళే నన్నూ అవంతినీ వదలి వెళ్ళి పోయారు!! అన్నాను పోలీసులతో

అయినా నా మాట వాళ్ళు వినే స్థితిలో లేరు!

అప్పటికే సిద్ధంగా వున్న జీపులో నన్ను ఎక్కించారు

అవంతి పసిపిల్ల బయంకర మైన దృశ్యాన్ని చూసి ఎలా చేష్టలుడిగి వుంటుందో అలా చూస్తూండి పోయింది

అవంతికి మహాపాల్ ఎదో చెబుతున్నాడు!

ఆమె ముఖ కవళికల్ని బట్టి, అతను నా వైపు చేతులు చూపుతూ అరుస్తున్న దాన్ని బట్టి అతను నాపై ఏవో చాడీలు చెప్పి ఆమెను నమ్మించాలని చూస్తున్నట్టు అర్ధమైంది

హత్యా నేరం – అందులో – జగదీష్– ప్రతాప్– రఘువీర్ల – హత్య– నేను చేశాననే ఆరోపణ! అది మహిపాల్ మా పర్వతారోహణ బృంద నాయకుడు – చేసిన ఆరోపణ, పైగా రక్త సిక్తమైన హతుల దుస్తులు!!! అవంతికూడా అతను చెప్పే కట్టు కదలు నమ్మితే ఇక నాకు అనుకూలంగా సాక్ష్యం చెప్పే మనిషే లేడు! నాకు నేపాల్ చాలా కొత్త ప్రాంతం" చూస్తుంటే మహిపాల్ ఏదో దుర్బుద్ధితో ఈ కుట్రంతా చేసినట్లనిపించింది

కాని నా అనుమానం రుజువు చేసేదెలా?

నా తల నరకి, హంతకులకు విధించే శిక్షే ఖాయంగా అమలు పరుస్తారు

నేపాల్లో ఇప్పటికి అమలులో వున్న వురిశిక్షా విధానం అది!

నా దురదృష్టానికి విలపిస్తూ జీప్లో కూర్చున్నాను

బుద్ధుడి అహింసా సిద్ధాంతాన్ని అవలంబిస్తూ, నిజమైన బౌద్ధులుగా ప్రసిద్ధి పొందిన బుద్ధుడి శిష్యులున్న యీ ప్రాంతంలో ఒక నిర్దోషికి ఇంతటిశిక్షా!?

నేను చెప్పే నిజాన్ని నమ్మేవారెవరూ వుండరా?

ఒక వ్యక్తి దోషి ఔనో కాదో కూడా విచారించకుండా ఏకపక్షంగా ఉరిశిక్ష విధిస్తారా?!?

ఇలా ఆలోచిస్తూ ఖైదుకు నడిచాను

నా మీద అభియోగం చేసిన ముఖ్య వ్యక్తి మా పర్వతారోహణా బృంద నాయకుడు మహిపాల్ వొక్కడే!

రాజామహేంద్ర ఆశీర్వచనాలతో నేపాల్ బావుటాను కాంచనగంగ అనే శిఖరాగ్రం మీద అధిష్టించాలని బయలు దేరిన బృందంలోని నేను అవంతిని చేజిక్కించు కోవాలనే దుర్బుద్ధితో ఆ బృందంలోని జగదిష్, ప్రతాప్, రఘువీర్లను – మోసంతో, కుట్రపన్ని హతమార్చాను!

ఆవిధంగా హిమాలయ పర్వతాలలోని కాంచనగంగ శిఖరాగ్రం మీద నేపాల్ దేశ జాతీయ బావుటా ఎగరవేయమన్న రాజామహేంద్ర కోరికను తిరస్కరించటమె కాక, అది నెరవేర కుండా కూడా చేసిన దేశద్రోహిని నేను–!

ఈ అభియోగం నామీద చేయబడింది! దీనికి ప్రబల సాక్ష్యం మహిపాల్!

అవంతికూడా మహిపాల్ అభిప్రాయాన్నే బలపరచినట్లు మౌనం వహించింది

దీనితో నా వాదనకు బలం లేకుండాపోయింది నా ప్రాణాలకు తెగించి నేను ప్రాణం కాపాడిన అవంతి నాకు వ్యతిరేకంగా, నేనే నేరస్తుణ్ణనే విషయం నమ్మటమా!?అవంతి మనసు విరిగేలా ఏఏ ఘోర అబద్ధాలు నామీద మహిపాల్ చెప్పాడో నేను ఊహించాను అయినా అవంతి అంత తేలికగా ఆ అబద్ధాలు నిజాలంటూ ఎలా నమ్మిందో నాకు అర్ధం కావటంలేదు!

అసత్యాలు వ్యాపించినంత త్వరగా సత్యాలు వ్యాపించవన్నదిందుకే?

రెండు మూడుసార్లు కోర్టు సమావేశాలకే నాకు ఏ శిక్ష విధించబోతున్నారో నాకు అర్ధమైంది

నాకు ఏ శిక్షను తీర్పు ఇస్తారో చూడటానికి, వినటానికి జనం తండోపతండాలుగా వచ్చేవాళ్ళు!

నేను కోర్టులోకి రాగానే అవంతి కోసం చూచేవాణ్ణి! అవంతయినా నేను నిర్దోషినని అనుకుంటే ఆ విధంగా ప్రశాంతంగా చావనన్నా చావాలని నా తాపత్రయం!

అవంతి ఎప్పుడొచ్చినా మహిపాల్తో కలిసి వచ్చేది

అతని భుజంమీద చెయ్యివేసి, నా వైపు కోపంగా కసిగా చూసేది ఆమెలో వచ్చిన ఆ మార్పును చూసి ఈ దుర్మార్గుడు దేనికైనా సమర్థుడే! అనుకున్నాను

నాకు చావు ఎటూ తప్పదని నిర్ణయించు కున్నాను

కేసు పైవారం వాయిదా వేశారు

నేను చెప్పాల్సినది ఏమన్నా వుంటే తీర్పు చెప్పటానికి ముందే లిఖిత రూపంగా ఇవ్వమన్నారు

# శివోక్తం

(ప్రఖ్యాత కన్నడ కవి సర్వజ్ఞ వచనాలు ఆధారంగా)

పుష్టనిడు, పెర్గు లేనట్టి బో జనమ్ము
దమ్ము జేయక జేయు పొలమ్ము పైరు
సంతు సంపద లేనట్టి చానబ్రతుకు
మందు వేసంగి కాసెడు నెంతసమము

చిత్త మొకచోట బచరింప, శివుని గుడిని
పదియు వేమార్లు చుట్టంగ ఫలితమేమి?
గాను గెద్దులు నిత్యమ్ము, మేన, కాడి
మోస, తిరుగవె కన్నుల మూతలుంఢ

ఆగిరా రేపురా యని యనుటకన్న
అర్థి యడిగిన యంత, అతని గూర్మి
చెంత చేరిచి తృణమైన చేతికొసగ
అద్ది, అతనికి కనకతుల్యమ్ము సుమ్ము–

– కనమలూరు వెంకట శివయ్య

అవన్నీ కోర్టు వాళ్ళు కళ్ళ నీళ్ళు తుడవ టానికి పాటించే కొన్ని నియమాలు!

వాటి వల్ల ఏమి లాభం వుండదని నాకు తెలుసు!

ఇక నేను మృత్యు ముఖంలోకి అడుగు పెట్టినట్లే నన్న నమ్మకం ధృఢ పడి పోయింది

అసలు హంతకుడు తప్పించుకు పోతే నిర్దోషిని నాకు మరణశిక్ష పడబోతోందే నన్న బాధ నన్ను కలవర పెట్టింది

అయినా నేను చేయగలిగింది అప్పటి పరిస్థితుల్లో ఏం లేదుగదా!

ఎందుకో నేను నిర్దోషి నని అవంతికన్నా చెప్పి ఆమెను నమ్మిస్తే, నేను చచ్చినా బ్రతికినా ఇక బాధ లేదనిపించింది

అలా చేయటం కేవలం నా ఆత్మ సంతృప్తి కొసమే నని తెలుసు!

అందుకే అవంతిని కలుసుకోవాలని అధికారులకు ఒక పిటీషను పెట్టాను

కాని మూడో రోజే అవంతి నన్ను కలుసుకోడానికి అయిష్టతను వ్యక్తం చేసిందని అధికారుల నుండి నాకు వర్తమానం అందింది

నేను మరింత నిరాశకు గురయ్యాను

ఇక నాకు రేపు మరణ దండన శిక్ష అమలు జరుపుతారనగా రాజామహేంద్ర సింహాస నానికి వచ్చిన వార్షికోత్సవ సందర్భంగా మరణ శిక్షలు రద్దు చేసినా వంటి వాళ్ళకు యావజ్జీవ ఖైదు శిక్షకు మార్చారు

ఈ మార్పు అనుకోనిది కావటం వల్ల ఎంతో ఆనందం కలిగింది! ఎలాగో అప్పటికి చావు తప్పింది!

తరువాత నేఫా బార్డరులో మారు వేషాల్లో హెరాయిన్, నల్లమందు చైనాకు చేర వేస్తున్న బృందాన్ని నేపాలు గూఢ చారి విభాగం బందించింది

అందులో జగదిష్, ప్రతాప్, రఘువీర్లు దొరికారు

వీళ్ళు హత్య చేయబడ్డారని అభియోగం వుండటంతో, ఆ హత్యా నేరం నా మీద మోప బడి నేను జైల్లో వున్న సంగతి అప్పటికే రికార్డ్ అయివున్నది

హత్య చేయబడ్డ వాళ్ళు సజీవులుగా వుండటంతో నా మీద అభియోగానికే తావు లేకుండా పోయింది! నేపాల్ ప్రభుత్వాధి కారులు నేను నిర్దోషినని నన్ను వెంటనే విడుదల చేశారు! తరువాత తెలిసింది ఆ దుర్మార్గుడిని గురించి"

మహిపాల్ అవంతితో కలిసి నేపాల్ వదలి పెట్టి వెళ్ళాడు! అతను నల్ల మందు, హెరాయిన్ లాంటి మాదక ద్రవ్యాలు స్మగుల్ చేసే బృంద నాయకుడుని అతని చర్యల్ని అనుమానించకుండా ఉండేందుకు ఈ హిమాలయ పర్యటనల ఆర్భాటం చేస్తుంటాడని తెలిసింది

(ఇంకా ఉంది)

# ఇద్దరూ ఉద్యోగస్తులైతే!

"ఒకళ్ళు సంపాదించి తెస్తే పదిమంది తినటం అనాదిగా వస్తోంది. అందుకే భారతదేశం వెనకపడి పోతోందేమో అనిపిస్తుంది. కుటుంబంలో చదువుకున్న వారందరూ ఉద్యోగం చేసి సంపాదిస్తే బరువు బాధ్యతలను సమానంగా పంచుకోవచ్చు. ఇందులో ఆడామగా తేడా లెందుకు..?" అంటున్నారు పోలీస్ సబ్ ఇన్స్పెక్టరుగా పని చేస్తున్న శ్రీ పి. ఆర్. కె. ప్రసాద్. ఈయన ఎమ్. ఎ. ఇంగ్లీషు లిటరేచర్ చదివారు.

'ఎమ్. ఎ. చదివి ఏ లెక్చరరో కావాలనుకుంటారు గాని మీరు పోలీసు ఉద్యోగంలోకి ఎందుకు వచ్చారని' అడిగితే!...

కాలేజీలో చదువుకుంటున్న రోజుల్లో ఎన్. సి. సి. లో ప్రథముడిగా ఉండేవాణ్ని. ఆర్మీలో చేరాలని కుతూహలపడేవాణ్ని. చదువైపోగానే టెలిఫోన్స్‌లో చిన్న ఉద్యోగంలో చేరాను.

తరువాత పోలీసు సబ్ ఇన్స్పెక్టరు ఉద్యోగానికి సెలక్ట్ అయ్యాను. ఉద్యోగం ఏదైనా పోలీసు ఉద్యోగానికి మరింత గౌరవ ప్రతిష్ఠలుంటాయి.



శ్రీ ప్రసాద్, శ్రీమతి నిర్మలాదేవి

# బరువు బాధ్యతలు పంచుకోవచ్చు

ప్రజాసేవ చెయ్యడానికి అవకాశముంటుంది. అనె ప్రసాద్ టెలిఫోన్స్‌లో ఉద్యోగం చేస్తున్నప్పుడు నిర్మలాదేవిని ప్రేమించారు. ఆమె కూడా టెలిఫోన్స్‌లో పని చేస్తున్నారు.

మాది కులాంతర వివాహం నేను అగ్రకులానికి చెందినవాణ్ని. ఆమె హరిజన యువతి మా వివాహానికి మా వైపువారు, అటు వైపువారు అభ్యంతర పెట్టారు అయినా ఇద్దరం ఉద్యోగాలు చేసుకుంటున్నాము మా భవిష్యత్తు మేము చూసుకుంటామన్న మొండి ధైర్యంతో వివాహం చేసుకోడానికి పూనుకున్నాము

1979 లో విజయవాడ నాస్తిక కేంద్రంలో అప్పటి డి. ఐ. జి. శ్రీ జగన్మోహనరావు గారి ఆశీస్సులతో, కులాంతర వివాహం చేసుకున్నారు. శ్రీ ప్రసాద్, నిర్మలాదేవి.

'ఇద్దరమూ ఉద్యోగస్తులమవటంతో మా పిల్లల పెంపకం మొదట్లో కాస్త కష్టమే అయ్యింది పిల్లలకు ఏడాది దాటంగానే బేబీకేర్ సెంటర్‌లో ఉంచటం వలన కొంత వరకూ సమాధాన పడ్డాము. ఈ బేబీకేర్ సెంటర్స్ మద్రాసు, హైదరాబాద్ లాంటి పెద్ద పట్టణాలలో బాగా అభివృద్ధి చెందినాయి ఇక్కడ ఎందుకనో వాటి విషయంలో శ్రద్ధ తీసుకోవటం లేదు భార్యాభర్తలిద్దరూ ఉద్యోగస్తులైనప్పుడు ఇంట్లో పిల్లల్ని చూసుకునే వారు లేనప్పుడు ఈ బేబీకేర్ సెంటర్స్ బాగా ఉపయోగపడతాయి." అన్న నిర్మల, ప్రసాద్‌లకు ఒక పాప, బాబు ఇద్దరూ స్కూళ్ళకి వెడుతున్నారు

పోలీసు ఉద్యోగంలో సెలవలుండవు అవసరమైతే ఇరవై నాలుగు గంటలూ పని చెయ్యాలి అందుకు సిద్ధపడే -ఈ ఉద్యోగంలో చేరాను ' అన్న శ్రీ ప్రసాద్‌కు శాంతి భద్రతల పర్యవేక్షణలో చేసిన కృషికి ప్రభుత్వం 1985 లో ఉత్తమ సేవా పతకం బహూకరించింది

'ఇలాంటి పతకాలు ఆయనకు ఎన్ని వచ్చినా వేళకూ, పాళకు ఇంటికి రాకుండా, తిండితిప్పలు సరిగ్గా చూసుకోకుండా, ఒక మామూలు కుటుంబంలో పిల్లల విషయంలో తండ్రి ప్రేమాభిమానాలు కరువవ్వటం వల్ల, నాకు మాత్రం అసంతృప్తిగానే ఉంది ఆయన డ్యూటీకి బయలుదేరే సరికి పిల్లలు స్కూలుకి వెళ్ళి పోతారు మధ్యాహ్నం ఆయన భోజనానికి వచ్చే వేళకి నేను ఆఫీసులో ఉంటాను. తిరిగి ఆయన రాత్రి ఇంటికొచ్చేసరికి పిల్లలు నిద్ర పోతారు. అంతా మెకానికల్‌గా జరిగిపోతోంది ఇద్దరం సంపాదిస్తున్నా మానసిక తృప్తి ఉండాలి కదా?' అన్నారు శ్రీమతి నిర్మలాదేవి

తప్పదు పోలీసుద్యోగంలో చేతుల నిండా పనే ..!

—కృష్ణాజీ






# "ప్రేమించే హృదయం చాలు"

## "–కృష్ణజ"



ప్రియ తుషారా!

స్వాతి వానకై వేచే ముత్యపు చిప్పలా, వెన్నెల కోసం ఎదురు చూసే చకోరంలా నీ చల్లని చూపుకై, తీయని చిరునవ్వుకై పరితపించే ఈ దీనుడ్ని ఎప్పుడు కరుణిస్తావు....?

తుషా... నీ అందంతో నన్ను ఊరిస్తున్నావు నీ నిర్లక్ష్యంతో నన్ను వేధిస్తున్నావు . ఇది న్యాయమా....?

కోటి సినిమా తారలకైనా లేని నీ అందం నన్ను పిచ్చివాణ్ని చేస్తోంది ప్రేమ బిచ్చగాడ్ని చేస్తోంది.... నీ కరుణ నాపై కలగని నాడు, నాకు మరణమే శరణం...

ఇట్లు
నీ ప్రేమ పూజారి–
"సుమన్"

"డియర్ శారా...

పడవ లాంటి కారులో నుండి హంసలా నువ్వు దిగుతోంటే నా గుండె లయ తప్పుతోంది ..

మై హార్ట్ ... మై లవ్ ... మై...."

అది, అలాంటివే మరో కొన్ని ఉత్తరాలు చదివి నిర్లక్ష్యంగా టేబిల్ మీదికి విసిరేసి ప్రక్కనే వున్న నీరజ వంక చూసి అర్థయుక్తంగా నవ్వింది తుషార....

ప్రతిగా తనూ ఓ చిరునవ్వు విసిరింది నీరజ.

'అబ్బబ్బ ... ఈ లౌ లెటర్స్‌తో చచ్చిపోతున్నానే నీరూ..." కానీ, ఆ చచ్చిపోతున్న లక్షణాలేవీ తుషార ముఖంలో కనిపించ లేదు.

"ఊఁ... చదువూ, సంపదా, సౌందర్యం స్వంతం చేసుకున్న అమ్మడివి. నీకు కాక మరెవరికొస్తాయి లౌ లెటర్స్... "

"అఫ్‌కోర్స్ .. ." అన్నట్టుగా నవ్వింది తుషార

ఈ కాంప్లిమెంట్ ఆమెను సంతోష పరచింది అన్నట్టుగా కళకళ లాడుతున్న ఆమె ముఖం చెప్పకనే చెప్పింది

"పోనీ, తుషారా! ఓ పని చెయ్యకూడదా... ?"

"ఏవిఁటి.. ?" అన్నట్టుగా కళ్ళు రెపరెప లాడించింది తుషార. ఆ కంటి రెపరెపలు చూసిన కుర్రాళ్ళు వెర్రెత్తి పోతే ఆశ్చర్యం లేదు

సుమన్ వర్ణించినట్టుగా కోటి సినిమా తారల సౌందర్యమూ ఒక్క తుషార సొత్తే ...

కలువ పూరేకుల కళ్ళు, అరుణారుణ కాంతులీనే చెక్కిళ్ళు పూరేకుల పెదవులు, సంపంగి నాసిక, వంగిన విల్లులాంటి కనుబొమల తీరూ, వర్షఋతువులోని మేఘ పంక్తిని పోలిన దట్టమైన కేశ సంపదా, సన్నని నడుము వంపూ .. తుషార కేవలం అజంతా శిల్పం .

రమణీయమైన శిల్పం..

ఆమె అందం అనన్య సామాన్యం .. అందుకే తుషార మిస్ కాలేజ్ అయ్యింది. కుర్రాళ్ళ కలత నిద్దురకు కారణం అయ్యింది

కలిమి తెచ్చిన ఆడంబరంతో అందరిలోనూ ప్రత్యేకంగా కనిపించే తుషార చదువులో కూడా ఎవరికీ తీసిపోదు.

క్లాసులో ఆమె ర్యాంక్ మూడుకు పెరగదు లక్ష్మి, సరస్వతులు ఒక్క చోట కాపురం చెయ్యరనేది పెద్దల మాట కానీ, తుషార విషయంలో ఆ ఇద్దరే కాకుండా రతీదేవిని కూడా తోడు తెచ్చుకుని ముగ్గురూ కలిసి ముచ్చటగా కాలక్షేపం చేస్తున్నారు. కానీ, విచారించాల్సిన విషయం ఏమంటే తుషారకు తన అందం తనకు తెలుసు

ప్రతి కదలికలోనూ తన సౌందర్య సంపదలోని విశిష్టతను ఎదుటి వారు గమనించేలా ప్రవర్తిస్తుంది.

"ఏమిటే నీరూ, ఏమిటో చెప్తానని అలా రెప్ప వాల్చకుండా చూస్తూండి పోయావ్.. ?"

నీరజ అలా ఎందుకు చూస్తుండి పోయిందో తుషారకు తెలుసు

"అహఁ .. అఁ.. ఏమీ లేదు "

"నీ అందాన్ని " అని వుంటే సంతోషించేది తుషార

"ఏవిటి చెప్తానన్నావ్.. ?"

"అబ్బే.. ఏమీలేదు.. నీకు నచ్చిన, నిన్ను మెచ్చిన ఓ కుర్రాడ్ని చూసి ప్రేమించేయ్ఁ అంతటితో నీకి ప్రేమ లేఖల బెడద తప్పుతుంది కదూ.. ?"

నిర్లక్ష్యంగా ఓ నవ్వు నవ్వింది తుషార – కడలి తీరంలో ఓ అల విరిగి పడ్డట్టు . వినీలాకాశంలో ఓ మెరుపు మెరిసినట్టు. ..

"ఏమిటి .? ప్రేమా ..? వీళ్ళనా.. ?"

మరోసారి నవ్వింది తుషార. తెల్లబోయినట్టు చూస్తూండి పోయింది నీరజ

"నీరూ డియర్! నా మేరేజ్ ఇలాంటి వాళ్ళతో అవుతుందని ఎలా అనుకుంటున్నావ్. ? మా డాడీ నా కోసం అందమూ, ఐశ్వర్యమూ వున్న ఓ ఫారిన్ రిటర్న్‌ను సెలెక్ట్ చేస్తారు ..'

"సెలెక్ట్ చేయడం కాదు . కొంటారను...."

"అఫ్‌కోర్స్.. ."

"తుషారా! నేనిక వెడతాను. .

"అరే. టిఫిన్ తీసుకుని వెడతావనుకుంటే . అప్పుడే వెడతానంటావేం?" డ్రైవర్ని పిలుస్తాను, కారులో వెడుదువు గాని ..."

తుషారకు ఓ ఎర్ర రంగు అందమైన కారు వుంది.

"ఇప్పుడేం వద్దు తుషారా .. నేను వెళ్ళాలి. "

"మా ఇంటికి వచ్చిన వాళ్ళు కాఫీ టిఫిన్ తీసుకోకుండా వెళ్ళటమే .. మా డాడీ ఊరుకోరు ."

ఆ మర్యాదలో ఆప్యాయత ఉండదు . కేవలం

స్టేటస్ సింబల్.. అప్పటి కప్పుడు తుషార వంట మనిషిని పిలిచి టిఫిన్, నేస్కేఫ్ తెప్పించింది.

బాదం హల్వా ... జీడిపప్పు పకోడి.. తుషార




అందంలా.. ఆమె అంతస్థులా..

"నీరూ శేఖర్ లేడూ.. ఆ పల్లవి వెంట తిరుగుతున్నాడు.. . అసహ్యంగా...."

"ఇందులో అసహ్యం ఏముంది.. .?" అన్నట్టుగా చూసింది నీరజ.

"అసలా పల్లవి ఎలా వుంటుంది. ? ఆ ఫుల్‌వాయిల్ చీరల్లో తనను చూస్తుంటే పగలు చూస్తే రాత్రికి కల్లోకి వస్తుంది ఓ అందమా...? ఆకారమా..? శేఖర్ తనలో ఏం చూసి లైక్ చేస్తున్నాడో..?"

"శేఖర్ పల్లవిని ప్రేమిస్తున్నాడేమో..."

"అదే నేనూ అంటున్నాను ఓ అందమా ...? డబ్బా...? తెలివితేటలూ అంతంత మాత్రమే.. మరి శేఖర్ ఏం చూసి ప్రేమిస్తున్నాడో పూర్ ఫెలో..."

"తుషారా! అందరూ నీలాగే ఎలా వుంటారు. ? పల్లవి చాలా మంచి అమ్మాయి. శేఖర్ ఆమె మంచి మనస్సు చూసి ప్రేమిస్తూండవచ్చు...."

ఈ మాటలు తుషారకు నచ్చలేదని ఆమె ముఖమే చెబుతోంది.

"ఏం మంచి మనస్సో.... ఏమో... మరి ఎబ్రాసి ముఖమూ... తనూ...."

నీరజ ఆశ్చర్యంగా చూసింది.

తుషార అన్నట్టుగా పల్లవి అనాకారి, ఎబ్రాసి కాదు. ఛామన ఛాయలో, కొంచెం పొట్టిగా అనిపించినా కళగల ముఖమే... ఆ ముఖంలో కళ్ళు పెద్దవిగా వుండి ప్రశాంతంగా, నిర్మలంగా ఆకర్షణీయంగా కనిపిస్తాయి.

ప్రపంచంలో తను తప్ప మరెవరూ అందంగా కనిపించరు తుషార కళ్ళకు .. చూసిన ప్రతివారికి వంక పెట్టే తుషార స్వభావం నీరజకు బాగా పరిచయమే....

ఈ రకమైన అహంకారం భరించడం చాలా కష్టం కానీ, నీరజ భరిస్తుంది

కారణం . తన స్నేహం కోసం వచ్చే తుషారను తప్పుకు తిరగగల కాఠిన్యం లేదు నీరజలో.

తుషార ప్రతి ఉదయం కాలేజీకి వెడుతూ తప్పని సరిగా నీరజ ఇంటి ముందు కారు ఆపి .. నీరజకు లిఫ్ట్ ఇస్తుంది

అలా ప్రతిరోజూ తుషార కారులో కాలేజీకి వెళ్ళడం నీరజకు ఇష్టం వుండదు... కాని ఇంటికి వచ్చిన తుషారను నొప్పించలేని సంస్కారం ...

నీరజది మధ్యతరగతి కుటుంబం

"అందమూ, చదువూ సామాన్యమే.

వయస్సు తెచ్చిన ఒంపు సొంపులతో చక్కని కనుముక్కు తీరుతో "ఫరవాలేదు" అనిపించే నీరజ తుషార ముందు మాత్రం వెలతెల పోతుంది.



తుషార ఇంత సామాన్యంగా వుండే తన స్నేహం కోరడంలో ఆంతర్యం నీరజకు తెలుసు-

తనలాగే డబ్బుగల వారి మధ్య అయితే అందరిలో తనూ ఒక్కతిగా మాత్రమే కనిపిస్తుంది.

కానీ, సామాన్యంగా వుండే వాళ్ళమధ్య అయితే తను మరింత ప్రత్యేకంగా కనిపిస్తుంది.

అదే తుషార కోరుకునేది.

అందుకే నీరజ స్నేహం కోసం ప్రాకులాడేది..

విషయం తెలిసినా, ఆంతర్యం ఏదైనా కానీ, తనకోసం వచ్చే తుషారను తప్పుకు తిరగ గలిగే తెలివితేటలూ, కఠినత్వమూ నీరజకు లేవు.

* * * *

కాలేజ్ టైమ్ అవుతూండటంతో రుబ్బుతూన్న పచ్చడిబండ తల్లి చేతికి ఇచ్చి బాత్‌రూంలోకి దూరింది నీరజ.

జడ అల్లుకూంటుండగానే తుషార కారు ఆగిన చప్పుడూ, ఆ వెంట వెంటనే రెండుసార్లు హారన్ చేసిన చప్పుడూ వినిపించి త్వరపడింది నీరజ.

"ఏయ్.. నీరజా! ఇంకా ఏం చేస్తున్నావ్...?" కారుదిగి దూకుడుగా వచ్చింది తుషార.

చీరకుచ్చిళ్ళు సవరించుకుంటున్న నీరజ నవ్వుతూ తలఎత్తి చూసింది స్కై బ్లూ కలర్‌శారీ, మాచింగ్‌బ్లౌజ్, మ్యాచింగ్ జ్యుయలరీతో మెరిసిపోతోంది తుషార

నీలి మేఘమాలికకు బంగారు జరీ అంచు కూర్చినట్లు ఆచ్ఛాదనలేని చోట్ల ఆమె బంగారు రంగు శరీరం పచ్చగా మెరిసిపోతోంది

మేఘకన్య ఒకర్తె ఆకాశంలో విహరించేందుకు వచ్చినట్లుందా క్షణంలో తుషార.

నీరజ తన చీర వంక చూసుకుంది.

తుషార డ్రస్ ముందు, తన చీర మంచిదే అయినా మరీ మామూలుగాపేలవంగా కనిపించింది–

క్రొత్త జరీ చీర ముందు వెలిసిపోయిన నూలుచీరలా

"ఏయ్ నీరజా ఏమిటిచూస్తున్నావు..? శారీ బావుందికదూ. ? డాడీ ఫారిన్ నుండి తెప్పించారు ఈ జ్యూయలరీ కూడా ఫారిన్‌దే.. బాగా మ్యాచ్ అయ్యాయికదూ....?

"అహ్... అలాగా . చాలా బావున్నాయి...."

"మీ హీరో ఇంట్లో లేరా. ..?

'ఎందుకూ ... ?"

"కంగారుపడకు... నీకు పోటీకి రానులే.. " తుషార నవ్వుతూనే అన్నా అందులో వినిపించే అతిశయం, అహంకారం తెలుస్తూనే వున్నాయి

"ఊరికే అడుగుతున్నాను .. అయినా నీరూ నువ్వు మీ బావ దగ్గర మరీ సోదిగా కనిపిస్తావే.. "

అలా ముఖం పట్టుకు అంటుంటే నీరజకు బాధ అనిపించినా పైకి కనిపించకుండా నవ్వుతూ అంది, "అయినా నాకు దిగుల్లేదు... '

"ఏం. ? మారేజ్ సెటిల్ అయిపోయిందనా.. ?

"కాదు"

'మరి ?'

"నేనెలా వున్నా మా బావ కళ్ళకు రంభలా కనిపిస్తాను. అందుకు. ."

"ఇంపాజిబుల్. . నేను నమ్మను ..."

"నువ్వు నమ్మినా, మానినా అది అంతే...."

"నీకంటే అన్ని విధాలా ఉన్నతంగా వున్న అమ్మాయి పోటీకి వస్తే ...?"

"ఊహు.... లాభంలేదు"

# "ప్రేమించే హృదయం చాలు"

తుషారకు ఆ మాటలు సవాల్ అనిపించాయి.

"ఒకవేళ నేను నీకు పోటీకి వస్తే.....?"

"నువ్వుకాదుకదా సరాసరి ఆ దేవలోకం నుండి అప్సరస దిగివచ్చినా అంతే. ..."

తుషార అహం దెబ్బతింది.

"నీరూ! నన్ను రెచ్చగొట్టకు.... "

"రెచ్చ గొట్టడం కాదు.... నిజం చెబుతున్నానంతే. .."

"నేను నేరుగా ఏ మగాడి కళ్ళల్లోనైనా చూస్తే చాలు... ఎంతటి మగాడైనా కుక్కపిల్లలా నా వెంట పడాల్సిందే .. "

నీరజకు నవ్వు వచ్చింది.

వెనుకటి ఓ హిందీ సినిమా స్టార్ కూడా ఇలాగే ఇచ్చింది. ఓ స్టేట్‌మెంట్.

ప్రతి మగాడూ కేవలం అందాలకూ, ఆడంబరాలకే దాసుడైపోతే ఈ ప్రపంచంలో అనుబంధాలకూ, అనురాగాలకూ తావే వుండేదికాదు..

నిజమే ... తన బావ మంచి పర్సనాలిటీతో, అందమైన ముఖ వర్చస్సుతో సినిమా హీరోలా వుంటాడు. దానికి తోడుగా మంచి పొజిషన్‌లో కూడా వున్నాడు... అతను యూనివర్సిటీ గోల్డ్ మెడలిస్ట్.

అయితే ఇవన్నీ తమ అనుబంధాలకు అడ్డురావు. బావకు తనంటే ప్రాణం... తనకు బావే ప్రపంచం తమమధ్య ఈ హెచ్చు తగ్గుల చర్చలకు అసలెప్పుడూ ఆస్కారంలేదు రాదు..... ఈ విషయం తుషారకు ఎలా తెలుస్తుంది. ..?

"ఏం ..? చల్లబడిపోయావ్...? భయం వేసిందా...?"హేళనగా నవ్వింది తుషార.

"లేదు.... ఓడిపోతావనుకుంటున్నాను....."

"ఛాలెంజ్ చేస్తావా... ?

స్టీరింగ్ వైపు చూపు నిలుపుతూ ఛాలెంజ్‌గా అడిగింది తుషార–

"ప్రయత్నించి చూస్తావా.....?" నవ్వింది నీరజ.

"వద్దు నీరజా! మళ్ళీ అనుకోనిది ఏదైనా జరిగితే నీకు బాధ... "

"తుషారా! అలా జరిగినా నా బావకు ఎన్నటికీ నేను వదులుకోను. అందం, డబ్బు, తెలివితేటలు స్వంతం చేసుకున్న ఓ కన్నెపిల్ల కవ్విస్తుంటే నిగ్రహించుకునేందుకు ఎంత మానసిక శక్తి కావాలో నాకు తెలుసు. కొబట్టి బావను నేను తప్పుపట్టను"

"కావచ్చు... కానీ, నా ప్రేమ నిజమే అనుకుని మీ బావ ప్రేమ పూజారిలా నా వెంట తిరుగుతూ దేవదాసులా మారితే....?"

ఎగతాళిగా నవ్వింది తుషార.

ఆ హేళన, ఆ అతిశయం నీరజ మనస్సును తాకాయి.

తుషార అహంకారం, అతిశయం ఆమెకు క్రొత్త కాదు....

కానీ, ఇలా తననూ తన బావనూ అవమానించడం సహించలేకపోయింది.

"తుషారా! అలా జరగదనే నా విశ్వాసం. అలాంటిదే జరిగితే మన పందెం విషయం చెప్పేదాం అప్పటికి అర్థం చేసుకోలేనంతటి మూర్ఖుడుకాడు బావ.

"ఒకె.... నీకే అంత ధైర్యం వున్నప్పుడు నేను వెనక్కు వెళ్ళలేను. కానీ, నీరజా! తరువాత బాధ పడి లాభంలేదు....."

"చెప్పానుగా.... ఇందులో బాధపడేందుకు ఏమిలేదని...."

"ఒ. కె..."

"ఒకె.. . విష్‌యూ గుడ్‌లక్...."

అప్పటి నుండే నీరజ బావ అజిత్ ఇంట్లో వున్న వేళల్లో తుషార రాకపోకలూ, పలకరింపులూ, నవ్వులూ, కబుర్లు ఎక్కువయ్యాయి.

చాలా ముక్తసరిగా వుండే అజిత్ ఆమెకు ఆశ్చర్యం కలిగించాడు. పరిస్థితి ఏమీ ఆశాజనకంగా కనిపించక పోవడంతో, ఏమైనా నీరజ ముందు ప్రొసీడ్ అవ్వలేక పోతున్నాడనే అభిప్రాయంతో అతనితో ఏకాంత సమావేశం అభిలషించింది తుషార.

ఒకరోజు అజిత్ నీరజతో సినిమా ప్రోగ్రాం వేసుకున్నాడు. అనుకోని విధంగా తయారయిన తుషారను చూసి అజిత్ కాస్త ఆశాభంగం చెందినా సభ్యత కొసం మరో మాట అనలేక పోయాడు.

ముగ్గురూ కలిసి సినిమాకు వెళ్ళారు.

అయితే ఒక్క అరగంటయినా గడవకుండానే నీరజ తలనొప్పి అంటూ ఇంటికి వచ్చేసింది.

అజిత్‌నూ, తుషారనూ సినిమా చూసి రమ్మని మరీ మరీ బలవంతపెట్టి.

* * * *

కారు దిగి లోపలికి వెళ్ళాడు అజిత్.

రెండుక్షణాలు కారులోనే కూర్చుని అతని వెనకే

## స్త్రీ

సాగుతోంది కదాని
మరి మరి సాగదీస్తే
సాగి సాగి
ఒక్కసారి
పుటుక్కుమంటుంది
చేయి చురుక్కుమనిపిస్తుంది
రబ్బరో
సాగుతోంది కదాని
హృదయంలో కుంపటి రాజేస్తే
ప్రాణమున్న బొమ్మలా వాడేస్తే
సహనం చచ్చి చచ్చి
ఒక్కసారి
ఎదురు తిరుగుతుంది
మగాళ్ళ్ని క్షణంలో దహిస్తుంది
ఆడది!
ఖబడ్దార్!!

-ఎన్. పూజ




లో పలికి వెళ్ళింది తుషార.

లోపలి గదిలో నుండి అజిత్, నీరజ మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"ఏయ్ః నీరూ నీకేమయినా బుద్ధి వుందా ?"

ఏమిటి బావా ?"

"ఆ డెవిల్‌కి నన్ను అప్పగించివస్తావా. ?"

"ఏం జరిగింది...?"

"నీకు బుద్ధి లేదు... సరదాగా ఇద్దరం వెడదామంటే ఆవిడ నెందుకు రమ్మన్నట్లు . ?"

"అసలేం జరిగింది బావా ?" మెత్తగా అడిగింది నీరజ.

"తను నీకు ఫ్రండ్ ఏమోగా. అలా వాగుతుందేం ..?"

"ఏమంది . ?"

"ఆవిడకు తనో పెద్ద సుందరాంగినని, ప్రతి మగవాడూ తనను చూసి మతి పోగొట్టుకుంటాడని అహం "

"తుషార ఏమంది బావా ?"

"నీ మొహం అంది ... సరేనా .' కసురుకున్నాడు అజిత్.

"తుషార నిన్ను ప్రేమిస్తుందేమో బావా ..'

'ఆః .. అదే... అసలు మన ఇద్దరి విషయం తెలిసిన ఏ బుద్ధి వున్న ఆడదైనా అలా అడుగుతుందా. ..?" కోపంగా అంటున్నాడు అజిత్.

"తుషార సౌందర్యం, సంపదా వున్న అదృష్టవంతురాలు. . ఆమెను కాదనుకునే వాళ్ళు ఎవరుంటారు...? ఆమెతో పోలిస్తే నేనెక్కడ ..? నక్కకూ నాగలోకానికి వున్నంత తేడా . ఇద్దరికీ .'

"షటప్. బుద్ధి లేకుండా మాట్లాడకు " కసిరేశాడు అజిత్ అతను కసిరినట్లు మాట్లాడినా అందులో తొణికిన ఆప్యాయతను అందుకోగలిగిన నీరజకు హాయిగానే వుంది

"అసలు తనేమయినా క్రాకా..?" అనుమానంగా అడిగాడు

"ఛ .ఛ అదేం కాదు బావా. ఒకవేళ తుషార నిన్ను ప్రేమిస్తోందేమో "

అజిత్ సూటిగా చూశాడు నీరజ వంక

'నీరూ! అసలు నీకు నిజంగా తలనొప్పి వచ్చిందా ? లేపోతే నన్ను తనకు అప్పగించి త్యాగం చేస్తున్నాను అనుకుంటున్నావా ?'

నీరజ కళ్ళు వాల్చుకుంది

'చూడు నీరూ! ఆవిడగారు నన్ను ప్రేమించినా, తమరు నన్ను త్యాగం చెయ్యడానికి సిద్ధంగా వున్నా, నేను మాత్రం ఆవిడగార్ని ప్రేమించేందుకు సిద్ధంగా లేను

'తనకేం తక్కువ బావా. ?"

'ఏమీ తక్కువ లేదు .. ఒక్క బుద్ధి మాత్రమే ఛీ ఛీ అందం ఉండగానే, డబ్బు వుండగానే, చదువుకోగానే సరా . సంస్కారం ఉండొద్దూ.. ?"

తన బావకు బాగా కోపం వచ్చిందనే విషయం గ్రహించింది నీరజ కానీ, ఆమెకు చాలా సంతోషంగా వుంది. చల్లని వెన్నెల రాత్రి 'ఆకాశంలో విహరించినంత ఆనందంగా, హాయిగా వుంది.

"పోనిలే బావా .. సినిమా ఎలా వుంది.. ?"

'సినిమా చూసే ప్రాప్తం కూడానా ఆవిడగారి పయ్యారాల ప్రదర్శనే సరిపోతే .

అతని కోపం చూస్తున్న నీరజకు నవ్వు వచ్చింది పెద్దగా నవ్వేసింది

నీరూ! ఇలారా "

కఠినంగా వున్న అతని స్వరానికి బెదిరిపోయింది నీరజ బెదురుతూనే అతనికి దగ్గరగా నడిచింది

'నీ తలనొప్పి మాట అబద్ధం కదూ ?'

"ఔను' అన్నట్లుగా తల ఊగించింది నీరజ భయంగా భయంతో ఆమె కళ్ళు రెపరెపలాడాయి. ఆమె భయాన్ని చూస్తున్న అతనికి నవ్వు వచ్చింది. కానీ ఆపుకున్నాడు

ఇలాంటి పిచ్చి పనులకు శిక్ష ఏమిటో తెలుసా ?'

'తెలీదు ' అన్నట్లుగా తల అడ్డంగా ఊపింది

మళ్ళీ మళ్ళీ ఇలాంటి పిచ్చి పనులే చేసి బావ చేత ఇలాంటి శిక్షలే వేయించుకోవాలి అనిపించేంత అందమైన శిక్ష వేశాడు అజిత్ ఇద్దరూ ఆ తన్మయత్వంలో నుండి తేరుకోక ముందే, వాకిట్లో కారు స్టార్ట్ అయిన శబ్దం వినిపించి ఉలిక్కి పడ్డారు.

"బావా! తుషార వెళ్ళిపోలేదా . ?"

"ఏమో నేను చూడలేదు .. కారు దిగి నేరుగా ఇంట్లోకి వచ్చేశాను" తమ మాటలన్నీ తుషార విన్నట్లుగా తెలుసుకుంది నీరజ ఆ తరువాత మరెప్పుడూ ఆ ఇంటి ముందు తుషార ఎఱ్ఱరంగు కారు ఆగలేదు □

## హత్యకు దారితీసిన తగాదాలు!

గన్నవరానికి చెందిన సత్యనారాయణ అనే 35 ఏళ్ళ లారి వోనరును రత్నా మిలిటరి భోజన హోటలులో ఏప్రియల్ ఒకటో తేదీ రాత్రి సుమారు ఆరుగురు వ్యక్తులు కలసి చంపేశారట అతని స్నేహితుడు బోయపాటి బసవ పూర్ణయ్య అనే అతన్ని కూడా తీవ్రంగా గాయపరచారట ఈ హత్యకు ఏవో చిన్న తగాదాలు కారణమట

## పరువుకోసం ప్రియురాలి హత్య!

మచిలీ పట్నానికి చెందిన రెడ్డిపాలెం అనే గ్రామంలో మర్రి రామకృష్ణారెడ్డి అనే అతను అదే గ్రామానికి చెందిన 75 ఏళ్ళ నాగరత్నమ్మ అనే ఆవిడ మనవరాలిని ప్రేమించి, రహస్య ప్రేమాయణం, ఆపైన కామాయణంలోనూ పడ్డాడట ఈ విషయం నాగరత్నమ్మకు తెలిసేసరికి, యిహ తన వారికి తెలిసి, తన పరువు పోతుందనే భయంతో ఆమెను చంపేసి, మంగినపూడి బీచిలో శవాన్ని పాతి పెట్టేశాడట

## తమ రోడ్డు తామే వేసుకున్న గ్రామస్థులు!

మణిపూరుకు చెందిన ఓ నాలుగు గ్రామాల ప్రజలు తమ నాలుగు వూళ్ళనూ కలుపుతూ నేషనల్ హైవేను కలిపి 12 కిలో మీటర్ల రోడ్డు వేస్తే తమ నాలుగు గ్రామ జనాభాకూ చాలా వసతి కల్పించినట్టుంటుందని ఆ రాష్ట్ర ఏలిన వారికి పలుమార్లు విన్నవించుకున్నా ఫలితం లేకపోయిందట దాంతో ఆ నాలుగు వూళ్ళ పెద్ద మనుష్యులూ కలసి, చిన్నా పెద్దలతో చర్చించి అంతా కలసికట్టుగా నడుం బిగించి ఆ 12 కిలో మీటర్ల రోడ్డూ వారే వేసేసుకున్నారట-హర్రే!! ఏలిన వారికి విషయం తెలిస్తే యిదేవిధంగా తమ రాష్ట్ర పౌరులంతా ప్రవర్తించగలందులకు విజ్ఞప్తి చేసి, చేతులు దులుపుకుంటారేమో కదా!!

## మీసాల్ని కురచ చేసిన జిలేబీలు!

మహారాష్ట్రకు చెందిన ధ్యాన్‌చెంద్ మీసాలు ప్రపంచంలోని మీసాల వ్యక్తుల మీసాలన్నిటి కన్నా అతి పెద్దదట. ఆయన మీసాలు 180 సెంటి మీటర్ల పొడవు వుండేవట అనగా అటో మూడడుగులు, యిటో మూడడుగులు అన్నమాట. ఒకనాడాయన వో విందులో జిలేబీ ఎగబడి తినేసరికి పాకం మీసాలకు అంటుకుని, ఆ మీసాల పొడవు పోయి వెంట్రుకలూడి పోయాయట ఇపుడాయన మీసాలు 80 సెంటి మీటర్లయి పోయాయట పాపం!

## విటమినుల లోపం– బట్టతల ప్రాప్తం!

ఆండ్రోజన్ అనే వో రకం పురుష హార్మోను వుండవలసిన కన్నా పురుష శరీరంలో ఎక్కువ వుంటే లైంగికవాంఛ తగ్గి పోతుందని, బట్టతల కూడా ఏర్పడుతుందని సోవియట్ దేశానికి చెందిన డాక్టరు ఓల్గారో ఘుంసైవెన్స్కయా అన్నారట. ఇనుము, రాగి, గంధకం, కాల్షియం మొదలైన విటమిను లోపాల వల్ల కూడా బట్టతల రావచ్చునన్నారట ఆ వెన్స్కయా గారు

## హత్యా! ఆత్మహత్యా!

హైదరాబాదు రహీంపురాకు చెందిన 22 ఏళ్ల నాగమణి అనే వో వివాహిత కటుంబ కలహాలు, ఆ జీవితం భరించలేక, మీద కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకు ఆత్మహత్య చేసుకున్నదట. ఆమెకు ముగ్గురు పిల్లలట - నిజంగా ఆత్మహత్యేనా లేక . కట్న సమస్యా!

## 8 మందిని కాల్చిన బాలుడు!

హైదరాబాదు ఫతేదర్వాజలో వో 12 ఏళ్ల బాలుడు మేడమీది తన యింటి కిటికిలోంచి గురిచూసి ఎయిర్ గన్‌తో దారేపోయే వో ఎనమండుగుర్ని కాల్చిపారేశాడట. బాగా గాయాలైన ఆ ఎనమండుగుర్ని ప్రభుత్వ ఆసుపత్రికి, ఆ బాలుణ్ణి పోలీస్టేషనుకూ చేర్చారట

## కలిసొచ్చిన అదృష్టం!

రామేస అనే వో ధనవంతుడు అమెరికాలో వో వేలం పాటలో వో మేకపోతుని పొరపాటుగా వేలంపాడి 24,295 డాలర్లు పోసి, కొన్నాడట మాంసం తూకంలో ఒక పౌను 64 డాలర్ల లెక్కన పాట పెడితే యీ మహానుభావుడు పౌను 64 సెంట్లుగా వూహించాడట పాటలో ఒక పౌను 215 డాలర్లు అయిందట ఇంత ఖరీదైన యీ మేక పోతును ఏం చెయ్యాలిరా బాబూ అని టి. వి లో వేషం వేయించాడట దాంతో అతని అదృష్టం తిరిగిందట. చాలా కార్యక్రమాలలో మేక నటిస్తూ లక్షలు ఆర్జిస్తూ, నామ్ నామ్" అనే పేరుతో ప్రేక్షకులకు అత్యంత యిష్టమైనదైపోయిందట

## పొరుగూరు వెళితేనే వస్త్రధారణ!

ఫ్రాన్స్ దేశం దక్షిణ తీరాన్న వుండే కాప్ డిఆగ్డే అనే వో గ్రామం కేవలం న్యూడిస్ట్ విలేజి అట ఈ గ్రామంలో వున్న 20 వేలమంది ఆడా మగా వొంటి మీద ఓ నూలుపోగయినా అడ్డు లేకుండా పుట్టినప్పుడున్నంత హాయిగా స్వేచ్ఛగా తిరుగుతారట బజార్లు, ఉద్యోగాలూ అన్నీ అదే అవతారంలో వుంటారట పొరుగూరు వెళితేనే బట్టలు ధరిస్తారట వారు - ఆ వూరెంత దూరం!

## కన్నడ భాషాభిమానుల వూరేగింపు!

బెంగుళూరులో కన్నడ భాషాభిమాన పార్టీ "కన్నడ ఛలువలిగార్" నాయకుడు వాట్బాల్ నాగరాజ్ ఆధ్వర్యంలో వో రెండు వేలమంది వూరేగింపుగా బయలుదేరి నగరంలో తెలుగు, తమిళ, హిందీ, మళయాళీ సినిమాలు చూపించడాన్ని గర్హిస్తూ నినాదాలు చేశారట అనక ఆ బృందం తెలుగు, తమిళ, మళయాళ సినిమా పోస్టర్లను తగులబెట్టి తమ ఆనందాన్ని వ్యక్తం చేసుకున్నారట - ఇది భాషాభిమానమా - దురభిమానమా - అహంకారమా!! □





## సీరియల్

# జీవితం చేజారిందా?

### కాకాని కమల

(గత సంచిక తరువాయి)

సీతకి ఆ ఇంటి వాతావరణం, భర్త ప్రవర్తన క్రమంగా అర్థం అయి అలవాటుపడసాగింది

ఊహ తెలిసిన నాటి నుంచి నిరాశ నిస్పృహలే మిగులుతున్నాయి

కొందరి జీవితాలు భగవంతుడు ఇలాగే సృష్టి చేస్తాడేమో!

దేనికి నోచుకోకుండా మోడులా?

కళ్ల ముందు కనిపించేవి ఏవి మనస్సుకు పట్టించుకోకుండా తామరాకు మీది నీటి బొట్టులా ఉండాలన్నదే సీత ప్రయత్నం.

బాధపడి మాత్రం ప్రయోజనం ఏమిటి?

ఆశారాణి తరచూ ఇంటికి వస్తూనే ఉంది.

పిల్లలతో బయటికి వెళ్లేవారు

ఒక్కోసారి ఇద్దరే వెళ్లేవారు.

అట్లా ఆమెతో వెళ్లినప్పుడు ప్రభాకర్ చాలా రాత్రి గడిచిపొయ్యాక ఇంటికి వచ్చేవాడు

భోజనం కూడా వద్దు" అనేవాడు

బయట ఎక్కడో ఆమెతో కల్సి డిన్నర్ ముగించుకొని ఉంటాడని గ్రహించుకొనేది సీత

కాని వివరం తెలియదు.

ఎప్పుడూ అలాంటి విషయాల గురించి భర్తని పెదవి విప్పి అడగ సాహసించలేదు

ప్రభాకర్ - సీతల మధ్య ఉన్నది అరమరికలు లేని భార్యాభర్తల బంధమే!

కాని -

ఇద్దరి మధ్య కొలతల కందని "దూరం" కూడా ఉంది.

'అతడికి తెలియదా ఏది తప్పో ఏది ఒప్పో?

తాళి కట్టిన భార్య ఎదురుగా ఉండగా పరాయి ఆడవాళ్లతో అంత స్వేచ్ఛగా ప్రవర్తించటంలో అతడి ఉద్దేశ్యం ఏమిటి? కనీసం భార్య బాధపడుతుందేమోనన్న ఆలోచన అయినా అతనికి కలగలేదా? గత్యంతరం లేక అభిమానం చంపుకుని తన ఇంటికి వచ్చిన అమ్మాయిని భార్యగా ప్రేమించలేకపోవచ్చు పేదరికం పట్ల అతనికి అలుసు, నిర్లక్ష్యం, అసహ్యం ఉండవచ్చు కాని. పేదవాళ్లకి మనస్సు ఉండదా? అది బాధపడదా?' అనుకొనేది వేదనగా తనలో తనే మథనపడుతూ ఎన్నో రాత్రులు నిద్రకి దూరం అయ్యేది సీత

కానీ ప్రభాకర్ ఆలోచన వేరుగా ఉండేది

"పేదరికంలోంచి వచ్చిన వాళ్లకి డబ్బు పట్ల ఆశ, సుఖాలపట్ల తపన ఉంటుంది. సీతకి ప్రేమతో అలుసు ఇస్తే ఆమె నెత్తికెక్కే ప్రమాదం ఉంది తన కపట ప్రేమతో భర్తని వలలో పట్టి కొంగున ముడి వేసుకుంటుంది తను తన పిల్లలు అన్న స్వార్థంలో మునిగిపోయి చివరికి సవితి పిల్లల్ని నానా బాధలకు గురిచేసి కష్టాలపాలు చేస్తుంది తల్లి లేని ఆ పసివాళ్లని తండ్రికి కూడా దూరం చేస్తుంది"

రెండవ పెళ్లి విషయంలో ఇలాంటి దురభిప్రాయాలు ఉన్నాయి ప్రభాకర్‌కి

నిజానికి సీత పిల్లల్ని కంటికి రెప్పలా చూసుకొంటున్నా, అదంతా నటనేమో, తనని ఆమె వైపుకు తిప్పుకుందుకు చేస్తున్న ప్రయత్నం ఏమో అని అప్పుడప్పుడు అతనికి తీవ్ర సందేహం కలుగుతూ వుంటుంది

అందుకే-

సీతని ఒక పరిధిలో ఉంచాలని, అది తన బిడ్డల భవిష్యత్తు దృష్ట్యా ఎంతో శ్రేయస్కరమని నిర్ణయించుకున్నాడు

అంతేకాదు ఆ ఇంటికి సీత వచ్చిన మరుక్షణం నుంచి ఆమె ప్రవర్తనని మూడవ కంటితో గమనించసాగాడు

ఏకారు పేరుతో పిల్లల్ని బయటికి తీసుకువెళ్లినప్పుడు సీత ప్రవర్తన గురించి పిల్లల్ని ఆరాగా అడిగేవాడు

సమయానికి వేళ ప్రకారం పాలు, పళ్లరసం ఇస్తోందో లేదో . బిస్కట్లు అవ్వి శ్రద్ధగా పెడుతూందో లేదో, లేక ఆవిడే తింటూందో కనుక్కునేవాడు

. స్నానం ఎవరు చేయిస్తారు?

సుబ్బులా? లేక సీతా .

జడలు ఎవరు వేస్తారు?

అల్లరి చేస్తే కొడుతుందా?

బాబు ఏడిస్తే వెంటనే ఎత్తుకుంటుందా? లేక అలాగే వదిలేస్తుందా? . .

ఇలాంటి వన్ని అడిగేవాడు.

'సీత పిన్ని చాలా మంచిది నాన్నా! అస్సలు కొట్టదు నీళ్లు సుబ్బులు

**జరిగిన కథ -9** : ఇద్దరి పిల్లల తండ్రియైన ప్రభాకర్‌తో సీతకు వివాహం జరిగింది. సీతకి పిల్లల పట్ల ఉన్న శ్రద్ధ, ప్రేమ చూస్తుంటే ప్రభాకర్‌కి ఆనందం కలుగసాగింది. ఆ ఆనందమే అతనికి సీతంటే అభిమానం ఏర్పడే లాగా చేసింది. ప్రభాకర్ స్నేహితురాలు ఆశ వచ్చి వెళ్లటంతో సీత మనసు కలత పడింది. సీత ప్రభాకర్‌కి భార్యలా గాక పని మనిషిలా ఉందని ఆశ అనేటప్పటికి ప్రభాకర్ హర్ట్ అవుతాడు. ప్రభాకర్‌కి సీతంటే కొంచం జాలి, కొండంత సానుభూతి ఉంది ఆమెపై తనకు గల మమకారం పైకి వ్యక్తం చేస్తే ఆమెకి లోకువయి పోతానేమోనని అది మనసుకే పరిమితం చేసుకున్నాడు.

పోస్తానంటే వద్దని తనే పోస్తుంది

"----------"

"నాన్నా? మరే----- సీత పిన్నికిట వాళ్ళింట్లో చాలా పని వుండేదిట, మనింట్లో అసలు పనే వుండదట సుబ్బులుతో చెప్పింది" అనేది ఆరిందాలా మంజు చేతులు తిప్పుతూ

అన్ని శ్రద్ధగా వినేవాడు ప్రభాకర్

"నాన్నా ! మొన్ననేం జరిగిందంటే తమ్ముడు ఆడుకుంటున్నాడు పిన్ని వంట చేస్తుంది. తమ్ముడు గట్టు మీద గిన్నె ఎత్తి గభాల్న పిన్ని కాలిమీద పడేశాడు. పెద్ద ఇత్తడి గిన్నె నాన్న. పాపం ఎంతో సేపు పిన్ని కాలు నొప్పితో బాధ పడింది కొంచెం ఏడిచింది కూడా . " కళ్ళు తిప్పుతూ అభినయం చేస్తు తండ్రికి చెప్పింది మంజుల

ఆశ్చర్య పొయ్యాడు ప్రభాకర్

"అలాగా! మరి అయితే తమ్ముణ్ని కొట్టలేదా పిన్ని .....!?"

"ఊహుఁ.. అస్సలు కొట్టదు. పిన్నికి కాలు బాగా ఎర్రగా వాచి నొప్పి చేసింది. తమ్ముడు నీళ్ళల్లో జారి పడిపోయి ఏడిస్తే పిన్ని ఎత్తుకుని ఆడించింది.." అంది

ఐదేళ్ళ మంజు ఆరిందాలా అన్ని నిష్కల్మషంగా చెప్తూ వుంటే ప్రభాకర్‌కి మనసు కొంచెం కుదుట పడేది

ఒకోసారి కావాలనే ఆఫీసు ఫైల్సు పక్కకి పెట్టి వేళకాని వేళ ఇంటికి వచ్చేవాడు

ఒకసారి–

సీత క్రింద చాప వేసుకొని హాల్లో పడుకొని వారపత్రిక చదువు కుంటోంది

పాప మంజూ సీతని రెండు చేతులా గట్టిగా కౌగలించుకుని ఆదమరచి నిద్రపోతూంది.

బాబు హరి మాత్రం .. ప్రక్కనే గుట్టగా పడివున్న ఆటబొమ్మల్ని కూడా పట్టించుకోకుండా సీత శరీరంతో యుద్ధం చేస్తున్నాడు

ఆమె జుత్తు గుప్పిళ్ళతో పట్టి పీకుతున్నాడు

చేతులతో కాళ్ళతో తన్నుతూ "పిన్ని..... పిన్ని . . " అంటు ఆమె మీద ఇష్టం వచ్చినట్లు స్వారి చేస్తున్నాడు గుర్రం ఆట ఆడుతున్నాడు

సీత దీక్షగా పుస్తకం చదువుకుంటు మధ్య మధ్య వాణ్ని అదిలిస్తుంది

ముద్దుగా కసురు కుంటోంది

ప్రభాకర్ ఏ వేళ ఇంటికి వచ్చినా మనసుకి స్వాంతన పరిచే ఇలాంటి దృశ్యాలే కళ్ళకి విందు చేస్తూ ఆహ్లాద పరిచేవి

క్రమంగా అతనికి సీత మీద నమ్మకం కలగ సాగింది

రోజులు గడుస్తున్న కొద్దీ ఆమెపై అనుమానం సన్నగిల్లి అనురాగం ఏర్పడ సాగింది.

ఆమె పట్ల ఏర్పడిన ఆ నమ్మకం చేత ఇప్పుడు ఇంటి గురించి, పిల్లల గురించి చింత తగ్గింది ఒకరోజంతా పిల్లల్ని చూడక పోయినా టూర్ లో వున్న అతనికి దిగులు అనిపించటం లేదు



# జీవితం చేజారిందా

తుపాను భీభత్సానికి చెల్లా చెదురు అయిన ప్రకృతి క్రమంగా ప్రశాంతత పుంజుకున్నట్లు అతని మనసు స్థిమితం పొందింది

సంధ్య లేని లోటు అతని గుండెలో పూడ్చలేనిదే అయినా పిల్లల భవిష్యత్తు కొత్త ఆశల్ని రేపింది

ముఖ్యంగా పిల్లలిద్దరికి కూడా సీత అంటే చాలా అభిమానం, ప్రేమ

ఒక్క రోజు తండ్రి కనిపించక పోయినా పేచీ పెట్టి ఏడవరు

కాని–

ఒక్క గంట సీత కనిపించక పోతే దిగులు పడే స్థితికి వచ్చారు

ముఖ్యంగా బాబు ఇల్లు అదిరి పోయేలా ఏడ్చి సీత కనిపించేదాకా– ఆకలేస్తున్నా –పాలు కూడా తాగడు నానా రభస చేస్తాడు

పిల్లల మనసు అద్దంలాంటిది

ఎదురుగా ఏ బింబం నిలిచినా అది ఇట్టే ముద్రపడుతుంది

మంజు.. హరి పసి పిల్లలు

పాల లాంటి లేత మనసు వాళ్ళది

వాళ్ళకి కేవలం అడిగినవన్ని కొనిఇచ్చి కారులో తిప్పే నాన్న–

ఏడ్చి రాగాలు తీస్తున్నా టయిమ్ ప్రకారం అన్నం నోట్లో కుక్కే ఆయా–

బస్తా మోసినట్లు చంకన ఎత్తుకుని పూరేగించే పనిపిల్లా సరిపోరు.

ప్రేమతో లాలించి, జోలపాడి, కథలు చెప్పి జో"కొడుతూ అలరించే 'అమ్మ" కావాలి

సహజ సిద్ధమైన లాలిత్యంతో గుండెకి హత్తుకునే కల్మషం లేని ప్రేమ కావాలి

తియ్యని మమత కావాలి

అవి అన్ని వాళ్ళకి సీత దగ్గర దొరికాయి.

అందుకే పందిర్ని అల్లుకొన్న లతల్లా క్షణాల్లో సీతని అల్లుకు పొయ్యారు.

వాళ్ళకి పేద– ధనిక, నీ– నా తారతమ్యాలు తెలియవు

చెట్టు వల్లని నీరు పోస్తే చిగురు వేస్తుంది

కాని–

డబ్బుంది కదా అని పాలు పోస్తే చిగిర్చదు !

స్త్రీ గుండెలో ప్రేమ భావం కూడా అలాంటిదే

తెచ్చి పెట్టుకుంటే వచ్చేది కాదు

కేవలం ప్రభాకర్ మెప్పుకోసం , ఆ భవంతిలో ఆధిపత్యం కోసం ఆశపడి ఆమె కపట ప్రేమతో పిల్లల్ని మాలిమి చేసుకోలేదు

"పిల్లల విషయంలో తను 'సవతితల్లి' అన్న ముద్ర తుడిచి పెట్టుకుని పోవాలన్నదే సీత ప్రధాన ఆశయం రేపు తనకి బిడ్డ పుట్టినా వాడు తనకి మూడవ సంతానం అనుకుంది ఆత్మసాక్షిగా

తల్లిలేని పిల్లలన్న సానుభూతితో, సహజ వాత్సల్యంతో వాళ్ళని ఆదరంగా అక్కున చేర్చుకుంది

అనతి కాలంలోనే 'అమ్మ'ని మరపించింది

* * * *

సీత కాపురానికి వచ్చి పది నెల్లు కావస్తూంది

ఇంతవరకు తిరిగి పుట్టింటికి వెళ్ళటం కుదర లేదు

పిల్లలు చెంగు వదల కుండా బాగా మాలిమి అయ్యారు

లంకంత భవనం!

ఆడదిక్కు లేక అస్తవ్యస్తమైన ఆ ఇల్లు ఇప్పుడిప్పుడే ఒక దారికి వస్తూంది

పుట్టింటికి వెళ్ళాలి అనిపించినా చప్పున సాహసం చేసి ప్రయాణం కాలేక పోయింది

అయినా అంత తొందరగా పుట్టింటికి వెడతానంటే భర్త ఏమంటాడో నని సందేహించింది

బాధ్యతా రహితంగా పిల్లల్ని ఒదిలి వెళ్ళలేదు

పిల్లల్ని తీసుకు వెడితే అతనికి ఇష్టం వుంటుందో వుండదో?

తన ప్రయాణం గురించి అడిగితే భర్త ఏమంటాడో ననిసందేహించింది.

సీత ఏది నిర్ణయించుకోక ముందే ఒకరోజు సుభద్రమ్మ ప్రయాణమై కూతురి దగ్గరకి వచ్చింది

తలవని తలంపుగా గుమ్మంలోకి వచ్చిన తల్లిని చూడగానే ఎతకి ఒక ప్రక్క ఆనందం అనిపించినా– మరొక ప్రక్క సంకోచం కూడా కలిగింది

'ఏమిటో నే తల్లి! నీ అత్తారు లక్షాధి కార్లని వినటమే గాని! ఒకసారి కళ్ళారా నీ సంసారం వైభోగం చూసి పోదామని వచ్చానే అమ్మాయ్ అంది సంబరంగా సుభద్రమ్మ

వచ్చిన అరగంటలోనే ఇల్లంతా హడావుడిగా తిరిగి ప్రతిగదిని, గదిలోని వస్తువుల్ని అంగుళం అంగుళం పరామర్శించింది

పట్టు పరుపులు, సిల్కు పరదాలు చేత్తో పట్టుకుని తడిమి నాణ్యతని పరిశీలించింది

ఖరీదులు అంచనా వేసింది

ఏ వస్తువుల్ని చూసినా వందల ఖరీదులోనే వుండి సుభద్రమ్మని దిగ్భ్రాంతురాల్ని చేసింది

రంగరంగ వైభవంగా ఇంద్రభవనంలా వున్న ఆ ఇంటిని చూశాక, తన నిరుపేద సంసారం, పూటకి గడవని దుస్థితి తల్చుకుంటె ఆవిడకి చాలా అక్కసుగ అనిపించింది

ఒసేయ్ సీత! వుండేది ఇద్దరూ ఇన్నన్ని మంచాలు సోఫాలు ఎందుకె? దుకాణాల్లో వున్నట్లు ఎంతెంత సామానో" బుగ్గలు నొక్కుకుంటూ ఆశ్చర్య పోయింది

'ఏమిటొ ఇన్నాళ్ళు సినిమాల్లో చూడటం, చెప్పుకొగా వినటమే గాని నీ యిల్లు అచ్చం జమీందారి భవనం లాగే వుందే సీతా! ఎంతైనా అదృష్టవంతురాలివి దేనికైనా పెట్టి పుట్టాలి 'యోగం వుంటె అంతే' ఎరి వెతుక్కొంటూ కాళ్ళ దగ్గరకి వస్తుంది. మీ ఆయనకి నెలసరి రాబడి ఎంత వుంటుందంటావ్? అతను చేసేది బాగా లాభసాటి వ్యాపారంటగా" అంది ఆరాగా

సీత కొంచెం చిరాగ్గా మొఖం తిప్పుకుంది

"ఏమోనమ్మా! నాకు తెలియదు.' అంది ముక్తసరిగా

తల్లి ధోరణి సీతకి నచ్చలేదు

కాని

సీతకి ఈ సంబంధం చెయ్యటంలో ఆవిడ అభిప్రాయం వేరు అల్లుడు బాగా దనవంతుడు అని తెల్సిన సుభద్రమ్మ దోరణి పెళ్ళికి ముందే బాగా మారిపోయింది పైగా ద్వితీయం

తన కూతురు కాస్త తెలివితేటలుతో వ్యవహరిస్తే భర్తని కొంగున ముడి వేసుకోవచ్చు.

సీత పెళ్ళి నిశ్చయం అయిన క్షణం నుంచి అత్తింట్లో మెసులుకోవాల్సిన జాగ్రత్తలు, నేర్పరితనం, తెలివితేటలు . అన్ని చెవినిల్లు కట్టుకుని అనుక్షణం బోధించసాగింది

అత్త, ఆడబిడ్డ పోరులేని ఒంటరి కాపురం కావటం చేత సంసారం ఎలా చక్కదిద్దుకోవాలో, జాగ్రత్తగా డబ్బు ఎలా వెనకేసుకోవాలో తీరిక దొరికినప్పుడల్లా హిత బోధలు చేసేది

"ఇదిగో! సీతా! ఆడదిక్కులేని సంసారం మీ ఆయన ఆగర్భ శ్రీమంతుడు వ్యాపారం మీద బోల్డు రాబడి నీకు తెలివితేటలు వుండాలే గాని భర్తని కొంగున ముడేసుకోవచ్చు నీ సవితికి లెక్కలేనన్ని చీరలు, నగలు వుండేవిట ఏదో ఇన్నాళ్ళకి నీ పంట పండి ఆ యింటికి వెడుతున్నావ్ సిరి రాగానే చాలా మంది తన వాళ్ళని మర్చిపోతారు

కాని నువ్వు అలాంటి దానివి కాదని నాకు తెల్సులే తల్లి"

ఏదో కాస్త నీ చెల్లెళ్ళని కూడా జ్ఞాపకం వుంచుకో. ముందు వెనక ఆదుకో

కడుపునిండా తిండిలేక ఒంటి నిండా బట్ట లేక ఎలా అవస్థలు పడుతున్నారో నీకు తెలియంది కాదు ఇంక వాళ్ళని నువ్వే కనిపెట్టుకొని చూడాలి అనేది కళ్ళనీళ్ళు పయిట కొంగుతో తుడుచుకొంటూ

చిన్న చేతిసంచితో ఎర్రటి నేత చీర కట్టుకుని తన ఇంటి గడపలో దీనంగా నిల్చున్న తల్లిని చూడగానే ఇప్పుడు సీతకి అవన్నీ జ్ఞాపకం వచ్చాయి తను కాపురానికి వచ్చి పదినెల్లు కావస్తోంది కదా తనని ఒకసారి పుట్టింటికి తీసుకొని వెళ్ళటానికి తల్లి వచ్చిందేమోనని సీత ఆశించింది

కాని –

నిన్ను చూసి రెండు రోజులు వుండి పోదామని వచ్చానే సీతమ్మా! అన్న తల్లి మాట వినగానే ఎంతో ఆశాభంగం కలిగింది ఎదురు చూడని విఘాతం కలిగినట్లు మనసు విలవిల లాడింది

ప్రభాకర్ అత్తగార్ని లాంచనంగా కుశల ప్రశ్న వేశాడు అంతే

మళ్ళీ ఆవిడ వునికిని కూడా పట్టించుకోలేదు

ప్రభాకర్ ఇంట్లో వున్న కాస్సేపు వంటగదిలో ఓ ప్రక్కన కూర్చొనేది సుబద్రమ్మ అల్లుడు అలా బయటికి వెళ్ళగానే ఇల్లంత గిలకలా కలయదిరిగేది సమస్తం చక్కపెట్టేది

పచ్చగా బొద్దుగా మంచి ఆరోగ్యంతో నిగనిగ లాడుతూ ఖరీదయిన దుస్తుల్లో వున్న పిల్లలిద్దర్ని చూడగానే ఆవిడకి కాస్త కంటగింపు అయ్యింది

మంజు చెవులకి పెట్టుకున్న ముత్యాల జూంకాలు, మెళ్ళో పులిగోరు చైను, చేతులకి బంగారు కడియాలు, కాళ్ళకి మువ్వల పట్టీలు అన్ని సవరించి పట్టి పట్టి చూసింది

మిసమిసలాడే కుచ్చుల మేక్సి చూసి – ఇంట్లో కూడా ఇంత ఖరీదయిన గౌను ఎందుకో? అంది సీత కేసి చూస్తూ కించిత్ అసూయ ధ్వనించే కంఠంతో పెళ్ళి వయసు వచ్చినా చెవులకి పుల్లలు పెట్టుకొని, చిరిగిన జాకట్లతో అతుకులు పడ్డ ఓణీలతో తిరిగే కూతుళ్ళు కళ్ళ ముందు మెదిలారు ఆ క్షణంలో సుబద్రమ్మకి

హుఁ

డబ్బు

దేనికయినా డబ్బే ప్రధానం

మనిషిని నిలబెట్టినా – పడగొట్టినా ఈ డబ్బే ప్రధానం అనుకుంది గుంబనంగా

ఈ ఐశ్వర్యంలో పదవ వంతు తనకి వున్న తన సంసారం సాఫీగా సాగిపోయి వుండేది కదా? కాని బగవంతుడు పక్షపాతి ఐశ్వర్యం అంతా ఒకళ్ళకి దారిద్ర్యం అంతా ఇంకొళ్ళకి ఇస్తాడు అనుకుంది రగిలే బాధతో ఆఖరికి ఆ అంతర్జ్వాల భరించలేక సీత కేసి చూస్తూ అంది–

పిల్లలిద్దరూ బాగానే వున్నారు గడుగ్గాయిలకి మల్లే నీ పెళ్ళికి ఎండిపోయి ఏడుపు మొగాలేసుకుని ఈసురోమంటూ వుండేవారు నీ చేతికి వచ్చారు బంతులల్లే తేలారు అంది

సీతకి తల్లి దోరణి ఎంత మాత్రం నచ్చలేదు

సుబద్రమ్మకి కూతుర్ని చూస్తుంటే చాలా ఆవేదన కలిగింది

అంతకంటె ఎక్కువ ఆశ్చర్యం కూడా కలిగింది

సుబద్రమ్మ కూతురింట్లో ఒక వారం రోజులు వుంది ఆ వారం రోజులు కూడా సీత పెళ్ళికి తను కొన్న వాయిల్ చీరలే మార్చి మార్చి కట్టటం చూసి కించిత్ విస్మయం కూడా కలిగింది సుబద్రమ్మకి

పెళ్ళికాక ముందు తన కూతురు ఎలా వుందో – పెళ్ళి అయ్యాక ప్రభాకర్ భార్యగా కూడా అలాగే వుంది

ఇంద్రభవనం లాంటి ఆ ఇంటికి ఇల్లాలులా లేదు ఆ ఇంట పనిమనిషి అంటే నమ్మేలాగ వుంది

అదేమిటే సీత! నువ్వు కాపురానికి వచ్చి ఎనిమిదినెల్లు పైగా అవుతోంది మీ ఆయన నీకు మళ్ళీ చీరలే కొనలేదూ? బాగుందమ్మా ' చక్కగా వుంది అంది బగబగమంటూ అల్లుడు మేటల కొద్దీ కొన్న చీరల్లో చాటుగా మాటుగా నాలుగు చెల్లెళ్ళకి ఇవ్వక పోతుందా అన్న ఆశతో వచ్చింది ఆవిడ

కాని –

సీతని చూస్తుంటే ఆవిడ ఆశలన్ని నిరాశలు కావటానికి ఆట్టే సమయం పట్టలేదు

తల్లి వాడే దోరణి, ఎత్తిపొడుపులు, సాదింపు సీతకి చాలా ఇబ్బంది కలిగించాయి

మంజు కాస్త వూహ తెల్సిన పిల్ల తండ్రికి చెప్తే? 

పైగా సుబ్బులు రంగా అక్కడక్కడే తిరుగుతున్నా కూడా సుబద్రమ్మ తన దోరణి మానటం లేదు

సరికదా –

ఏమే సుబ్బులూ! రెక్కల కష్టం చేసుకు బ్రతుకుతున్న మీ అమ్మగారి కంటి నువ్వు దర్జాగా కనిపిస్తున్నావ్ నా కంటికి నాకు తెలియక అడుగుతాను మీ అయ్యగారు కట్టుకున్న పెళ్ళానికి నాలుగు మంచి చీరలు కొనిపెట్టలేడుటే' ఇంటి చాకిరి చేయించుకోవటమే గాని కట్టుకున్న దాని కష్టం – సుఖం చూడనక్కర్లేదుటే? అంటూ దాన్ని నిలదియ్యటం మొదలు పెట్టింది

సీతకి ఆ పరిస్థితి చాలా ఇరకాటం అనిపించింది అందుకే తల్లి మీద విసుక్కునేది

ఇప్పుడు నాకేమయిందమ్మా? చీరలు లేక ఇప్పుకుని తిరుగుతున్నానా' నా సంగతి నాకు తెల్సులే అనవసరపు విషయాలు నీకెందుకు? నువ్వు కాస్త వూరుకో అంది విరాగ్గా మందలిస్తున్నట్లు

అది కాదే తల్లీ! రెండో పెళ్ళి అది ఇద్దర పిల్లల తండ్రి అయినా వెనకాడకుండా తల ఒగ్గి చేసుకొన్నది ఎందుకు? మిగత విషయాల మాట ఎలా వున్నా కూటికి గుడ్డకి కరువుండదన్న ఆశతోనేగా? నీ సవితి ఏ వేళా ఖరీదైన చీరల్లో ఒంటి నిండా నగలతో లక్ష్మీదేవిలా వుండేదిట! మీ అత్తగారు మాత్రం' అందుకని ఏదో తల్లిని కాబట్టి నువ్వు సుఖంగా వుండాలన్న ఆరాటంతో అడిగాను

నిరసనగా తల తిప్పుకుంది సీత

వాళ్ళతో నాకు పోటీ ఏమిటమ్మా? వాళ్ళు పుట్టిళ్ళ నుంచి ఘనంగా అరణాలు తెచ్చుకున్నారు అగర్భశ్రీమంతుల ఇంటి ఆడపడుచులు పెళ్ళయి కాపురానికి వచ్చిన మర్నాడే కట్టుకునే జాకట్టు దగ్గర్నుంచి కొనమని భర్తని వేదించలేదు అయినా ముందు ముందు నేను మాత్రం కొనుక్కోలేక పోతానా' కట్టుకోలేక పోతానా? అంది కాస్త ఆవేశంగా

దాంతో సుబద్రమ్మ మొగం ముడుచుకుంది

అయినా నీ కెందుకమ్మా ఈ విషయాలన్ని నా తంటాలేవో నేను పడతాలే చీరలు చిరిగితే కుట్టుకొని కట్టుకుంటాను గాని నిన్ను మాత్రం కొనమని అడగను సరా? అంది అక్కసుగా సీత

ఆ మాటలు అంటున్నప్పుడు ఆమె కంఠం రుద్ధం అయి కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి

(ఇంకా ఉంది)









## చిత్రీకరణ ముగిసిన కలియుగ కృష్ణుడు

"ఊటిలో వారం రోజులు సాంగ్స్ ఎక్సరైజ్ చేశాక ఏప్రిల్ 16 నుంచి మే 8 వరకు జరిగిన చివరి షెడ్యూల్ ఎతాక సన్నివేశాలతో పాటు అనూరాధ జయమాలిని డిస్కో శాంతి డాన్సను పూర్తి చేశాం అన్నారు కె మురళీమోహనరావు ఈయన దర్శకత్వంలో విశ్వశాంతి ఎంటర్‌ప్రైజస్ ఎ కె వి ప్రసాద్ నిర్మించే పై చిత్రంలో బాలకృష్ణ రాధ రావు గోపాలరావు నూతన్‌ప్రసాద్ గొల్లపూడి సుదాకర్ అల్లు రామలింగయ్య సాక్షి రంగారావు రంగనాద్ (గెస్ట్)తో పాటు శారద ఒక కీలకమైన పాత్రను నిర్వహించింది ఎరుచూరి సోదరుల రచన వేటూరి పాటలు చక్రవర్తి సంగీతం నందమూరి మోహనకృష్ణ ఛాయ తోట తరణి హేమసుందర్ శిల్పం ప్రకాష్ ప్రొడక్షన్ ఎం రాదాకృష్ణ నిర్మాణత నరసింహారావు కూర్పుతో జి నారాయణదాస్ సహ నిర్మాత

## జయసుద తొలి సంధ్య

"ఏదల పొరబాటుకు తాను ఫలిత

# సినిమా విశేషాలు

-జి విజి

మనుభవిస్తూ అపసవ్య మార్గంలో ఉన్న భర్తలో పరివర్తన తెచ్చే క్లిష్టమైన పాత్రలో జయసుధ ధనమున్న భర్త దొరుకుతున్నా మనసున్న భర్తే కావాలనుకునే మధ్య తరగతి కుటుంబంలో పుట్టిన యువతిగా రజని ఆ పల్లెలో జరిగే ప్రతి అన్యాయాన్ని ప్రతిఘటించే పాత్రలో రాజశేఖర్ ధనమదాంధకారంలో స్వైర విహారం చేసే పాత్రలో చరణ్‌రాజ్ నటిస్తున్నారు తొలి షెడ్యూల్ ఏప్రిల్ 15కి పూర్తయింది మలి షెడ్యూల్ మే 1నుంచి నెలాఖరువరకు జూన్‌లో పాచ్ వర్క్ జూలై రిలీజ్ అన్నారు రాజాచంద్ర ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో బి ఎస్ ఫిలిమ్స్ బండారు భాస్కరరాజా నిర్మిస్తున్న పై చిత్రంలో తులసి కె విజయ పుష్పలత రమణమూర్తి శుభలేఖ సుదాకర్ తక్కిన నటవర్గం కె జయచంద్రారెడ్డి సమర్పణలో పూసల మాటలు వేటూరి పాటలు చక్రవర్తి సంగీతం ఎస్ సుధాకరరెడి ఛాయ తార నృత్యాలు కె శ్రీనివాస్ సహకార దర్శకత్వం కృష్ణ శిల్పం బాబ్జీ చిన్నారావు ప్రొడక్షన్ డి రాజగోపాల్ కూర్పుతో బి నాగేశ్వరరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ బి సుబ్బారావు ఎం సుబ్బారావు సహ నిర్మాతలు

## విడుదలకు సిద్ధంగా ఉన్న అరుణ కిరణం

మగవాడి స్వార్థానికి అహంకారానికి ఆడది స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పోగొట్టుకుని బాధపడటం సహజం ఈ చిత్రంలో భర్త ఆట వస్తువుగా ఉపయోగించుకుంటే పరిస్థితుల ప్రభావం వల్ల ఒక యువతి చదువు సంస్కారం ఉండి కూడా నిస్సహాయురాలైపోతుంది విద్యావంతురాలైన యువతి వివాహానికి ముందు తండ్రి దగ్గర ఆ తర్వాత భర్త దగ్గర ఎదుర్కొనే సమస్యలు ప్రధానాంశాలు నేడు విద్యావంతులైన యువతులను పట్టి పీడిస్తున్న సమస్య చుట్టూ అల్లిన కథ డాక్టర్ అరుణగా విజయశాంతి విజృంభించింది మరో నాయికగా నటించే శ్వేత నటనలోను నృత్యంలోను మధుమతి డాన్సింగ్ అండ్ ఆక్టింగ్ అకాడమీలో తర్ఫీదు పొందింది అన్నారు ముత్యాల సుబ్బయ్య ఈయన దర్శకత్వంలో వై అనిల్‌బాబు నిర్మించిన కృష్ణచిత్రవారి పై చిత్రంలో శరత్‌బాబు డాక్టర్ రాజశేఖర్ అన్నపూర్ణ అరుణ కోట శ్రీనివాసరావు వేలు హైదరాబాద్ వెంకటేశ్ థియేటర్ అధినేత బి ఎ రాజు నటించారు మైనంపాటి భాస్కర్ కథకు ఎం వి ఎస్ హరనాథరావు సంభాషణలకర్త ఎ నారాయణరెడ్డి వేటూరి జాలాది గీతాలకు చక్రవర్తి స్వరకర్త ఆర్ రామారావు ఛాయ యోగి సంయుక్త దర్శకత్వం చినబాబు నిర్వహణ గౌతంరాజు కూర్పుతో లక్ష్మిచిత్ర అధినేత వై హరికృష్ణ నిర్మాణ సారథ్యంలో టి కృష్ణ సమర్పకులు



## టి కృష్ణ దర్శకత్వంలో చిత్రీకరణ ముగిసిన రేపటి పౌరులు

వక్రమార్గం పట్టిన బాలల పెద్దలకు కళ్ళు తెరిపించే రీతిలో రేపటి పౌరులైన నేటిబాలలను చక్కగా ఎలా తీర్చిదిద్దాలో తెలిపే ఇతివృత్తం కీచరమ్మగా విజయశాంతి సంఘంలోని ఖరానా మనుషులచే పతిత కాబడి తన బిడ్డను చక్కగా చదివించే ఓ విశిష్టమైన పాత్రలో అనూరాధ అద్భుతంగా నటించారు అన్నారు పోకూరి బాబూరావు ఈయన సమర్పణలో టి కృష్ణ కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహించిన ఈ తరం పిక్చర్స్ మూడవచిత్రం రేపటి పౌరులు లో డాక్టర్ రాజశేఖర్ వేలు సత్రా కోట శ్రీనివాసరావు ఎ ఎల్ నారాయణరావు రాళ్ళపల్లి పొట్టి ప్రసాద్ నల్లూరి వెంకటేశ్వర్లు వై విజయ కె వి లక్ష్మి తాతినేని రాజేశ్వరి బాలతారలు సతీష్ శ్రీ హనుమ సాయిభూషణ్ జితేంద్ర శ్రీనివాస్ విజయకృష్ణ యశోదర్ నటించారు ఎం వి ఎస్ హరనాథరావు మాటలు చక్రవర్తి స్వరకల్పనలో ఎ నారాయణ రెడ్డి జాలాది వంగపండు గీతాలు రాశారు ఆర్ రామారావు ఛాయ బి ఎస్ మోహన్ శిల్పం బి కోటేశ్వరరావు ప్రొడక్షన్ గౌతంరాజు కూర్పుతో పోకూరి వెంకటేశ్వరరావు నిర్మాత







# దర్శక నిర్మాత ఏ. బి. రాజేంద్ర ప్రసాద్

ఎదుగుతున్న ప్రేక్షకుల మేథకు అనుగుణంగా కథలో కథనంలో, పాత్రల్లో, చిత్రీకరణలో వైవిధ్యం చూపించాలనే తపనగల వారిలో ఏ.బి. రాజేంద్రప్రసాద్ ముఖ్యులు.

ఈయన గుడివాడ తాలూకాలోని దోకిపర్రు గ్రామంలో సంపన్నుల కుటుంబంలో 1932 నవంబర్ 11న జన్మించారు. ఫస్ట్‌ఫామ్ వరకు గన్నవరంలో చదివే రోజుల్లో నాటకాలు, సినిమాలు చూడటంలో కలిగిన ఉత్సాహం బందరులో స్కూల్ ఫైనల్ చదువుతున్నప్పుడు ఎక్కువై, నాటకాలు వేయడానికి పురిగొల్పింది. కాకినాడ పి. ఆర్ కాలేజిలో చదువుకుంటున్నప్పుడు ఆ ఉత్సాహం నాటకాలలో నటనకు బహుమతులిప్పించింది. కొన్ని నాటకాలలో ఈయన స్త్రీ పాత్రలు ధరించారు. ఆత్రేయ విరచిత కప్పలు" నాటకంలో పంకజమ్మ పాత్ర నిర్వహణలో ఈయనకు చాలా మంచి పేరొచ్చింది. సినిమాలలోనూ నటించాలనుకున్నారు. "డిగ్రీ తీసుకున్నాక ఆ ప్రయత్నం చేయవచ్చుగా?" అని అక్కినేని నాగేశ్వరరావు సలహా ఇవ్వడంతో బి. ఎస్. సి. పట్టా పుచ్చుకుని, 1957లో మద్రాసు చేరుకున్నారు. ఐతే, నటుడుగా కాక నిర్మాతగా.

అప్పటి జెమినీ స్టూడియోలోని ప్రముఖ శబ్ద గ్రాహకుడు స్వర్గీయ పర్వతనేని రంగారావుతో కలిసి, తన తండ్రిగారి పేరిట "జగపతి" సంస్థను నెలకొల్పారు. 1960లో విడుదలైన "అన్నపూర్ణ" వీరి తొలి హిట్ చిత్రం. ఈ చిత్రంతో రంగారావు తన భాగాన్ని వదులుకున్నారు.

తదాదిగా "అ" లేక "ఆ" మొదటి అక్షరంగా గల, "ఆరాధన, ఆత్మబలం, ఆస్తిపరులు, అదృష్టవంతులు, అక్కా చెల్లెలు" నిర్మించారు.

"దసరా బుల్లోడు" చిత్రానికి కథ రాసి, దర్శకత్వ భారం కూడా వహించారు. ఈ చిత్రం అనేక రికార్డులను సృష్టించింది. ఆ తర్వాత దీనిని హిందీలో కూడా రూపొందించారు.

ఇంకా "బంగారు బాబు, మంచి మనుషులు, రామకృష్ణులు, ముద్దుల కొడుకు, ఎస్. పి. భయంకర్, భార్యాభర్తల బంధం" స్వీయ దర్శకత్వంలోనూ, "లంచావతారం" చిత్రాన్ని దాసరి నారాయణరావు దర్శకత్వంలోనూ నిర్మించారు.

తమిళంలో "ఎంగళ్ తంగరాజా, ఉత్తమన్, పట్టాకత్తి భైరవన్" చిత్రాలను డైరెక్ట్ చేస్తూ నిర్మించారు.

పల్లవీ సంస్థకు "అందరూ దొంగలే" చిత్రాన్ని డైరెక్ట్ చేశారు.

జగపతి చిత్రాలన్నిటిలోని హిట్ సాంగ్స్‌ను, మరపురాని సంఘటనలను "చిటపట చినుకులు" రెండు భాగాలుగా రూపొందించారు.

ఏళ్ళ తరబడి తన సంస్థలో పని చేసే సిబ్బంది కోసం "పిచ్చిమారాజు" చిత్రానికి దర్శకత్వం నెఱపి, వచ్చిన ఆదాయాన్ని ఆ సిబ్బందికి పంచి పెట్టిన సహృదయులు రాజేంద్రప్రసాద్.

ఇప్పుడీయన అక్కినేని నాగార్జున నాయకుడుగా స్వీయ దర్శకత్వంలో నిర్మిస్తున్న "కెప్టెన్ నాగార్జున్"లో నవ నటి స్రవంతి నాయిక. రాజేంద్రప్రసాద్, గొల్లపూడి మారుతీరావు, నూతన్ ప్రసాద్, శుభలేఖ సుధాకర్, వినోద్, శ్రీలక్ష్మి, డబ్బింగ్ జానకి, లక్ష్మీప్రియ ఆదిగాగలవారు నటిస్తున్నారు.

—(జి. వి. జి.)

# అభిమాన తారలపై అభిప్రాయం

ఆంధ్రుల అందాల అభిమాన నటుడుగా, ఆంధ్రప్రదేశ్ సినీ అభిమానులలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొన్న "శోభన్‌బాబు" గారు నా అభిమాన నటులు. మనకున్న కొద్దిమంది ఉత్తమ





నటులలో శోభన్‌బాబుగారు ఒకరు. ఎటువంటి పాత్రనైనా అవలీలగా పోషిస్తారు. ఆంధ్రదేశంలో తుఫాన్ వచ్చినపుడు తుఫాన్ బాధితులకు తనకు తోచినంత సహాయం చేసిన వారిలో శోభన్‌బాబుగారు ముఖ్యులు. నిర్మాతలకు కూడా శోభన్‌బాబు గారంటే ప్రత్యేక అభిమానము. ఈ మధ్యన శోభన్‌బాబుగారు పౌరాణిక చిత్రాలలో నటించడంలేదు. మావంటి అభిమానులకు అది నిరాశ కల్గిస్తోంది. శోభన్‌బాబుగారు అన్ని రకాల పాత్రలు పోషించి ఆంధ్రుల అభిమానం నిలబెట్టుకుంటారని ఆశిస్తూ, శోభన్‌బాబుగారు తెలుగు చలన చిత్ర పరిశ్రమలో "ఆరని జ్యోతి"గా ఉండిపోవాలని మా ఆకాంక్ష.

—యస్. రేవతి, మంగళగిరి

* * *

నేను బుల్లెట్ కింగ్ రెబల్‌స్టార్ కృష్ణంరాజు అభిమానిని. అతడంటే నాకెంతో ఇష్టం. ఆయన చిత్రం బెబ్బులి చూచి అభిమాని నయ్యాను. ధర్మానికి, న్యాయానికి కట్టుబడిన నిండు గుండె లాంటి మనిషి ఆయన. ధన గర్వానికి వెనుకాడని మంచి మనిషి. అంతేకాదు. సీతారాములు, ధర్మాత్ముడు మరియు కోటి కొక్కడు మొదలగు చిత్రాలలో నటించి అందులో పేదలకు జీవనోపాధి కల్పించే పాత్రల్లో నటించెను. నటించటమే కాదు. అది నిజం అని నిరూపించుకొనే మంచి వ్యక్తి





ఆయన. ఆయన మహత్తరమైన పాత్ర బొబ్బిలి బ్రహ్మన్న. నాకు ఆ పాత్ర చూస్తే నటరాజే పరవశిస్తాడు అనిపిస్తుంది. ఆ పాత్రతో ఎంతో మంది ఆదరాభిమానాలు చూరగొన్న మంచి నటుడు ఆయన. అటువంటి పాత్రలే ఆయన ధరించాలని రానున్న తాండ్ర పాపారాయుడు చిత్రం విజయభేరి మ్రోగించాలని కోరుకుంటున్నాను. ముఖ్యంగా నేను కోరుకునే దేమిటంటే, ఆయన అభిమానిగా నేను కొన్ని సూచనలు ఇవ్వాలని అభిలషిస్తున్నాను. ఇంతవరకూ సంపాదించుకున్న ప్రజాభిమానం కోల్పోయేలా చేసే పాత్రలు నటించ కూడదని మనవి చేస్తున్నాను.

జి. శంకర్, కోరుట్ల, కరీంనగర్

* * *

నా అభిమాన నటి శ్రీదేవి. గ్లామర్ వల్ల కొంతమంది, టాలెంట్ వల్ల కొంతమంది అభివృద్ధిలోకి వస్తారు. కాని గ్లామర్, టాలెంట్, రెండూవున్న తారలు మన తెలుగు సినీరంగంలో అరుదుగా వున్నారు. వారిలో శ్రీదేవిదే ప్రథమస్థానమని నిస్సందేహంగా చెప్పవచ్చు. గ్లామర్ వల్ల కొందరికి ఆరాధ్య దేవత, టాలెంట్ వల్ల చాలా మందికి ఆమె అభిమానతార అయ్యింది. పదహారేళ్ల వయసు, కార్తీకదీపం, ఆకలిరాజ్యం, అనురాగదేవత, ప్రేమాభిషేకం, వసంత కోకిల, దేవత, ఇల్లాలు, పచ్చనికాపురం మొదలైన చిత్రాలు





ఆమె నటనా ప్రతిభకు దర్పణాలు. ఆమె నటించిన ప్రతిచిత్రంలోను తన పాత్ర మేరకు న్యాయం చేకూర్చింది.

ఆమె హిందీ రంగానికి వెళ్ళి పోవడం అభిమానులకు నిరాశ కల్గించినప్పటికీ, ఒక తెలుగు తార హిందీ రంగంలో నెం. 1 కావడం తెలుగు ప్రేక్షకులందరూ గర్వించదగ్గ విషయం. కాని దురదృష్ట వశాత్తు ఈ మధ్య ఆమె నటించిన తెలుగు చిత్రాలలో ఆమె గ్లామర్‌ను మాత్రమే ఎక్స్‌ప్లాయిట్ చేయడం జరిగింది. హిందీ చిత్రాలలో కూడా ఆమె గ్లామర్ పాత్రలకే పరిమితమవ్వడం విచారకరం. ఏ నటినైనా 'గ్లామర్' ఆమెను ఒక స్థాయి వరకూ మాత్రమే తీసుకువెళ్ళగలదు. కాని ఆ స్థాయిని నిలబెట్టు కోవడం 'టాలెంట్' వున్న పాత్రల వల్లే సాధ్యమవుతుంది. ఈ అభిప్రాయాన్ని మా అభిమాన తార శ్రీదేవి గుర్తించి నటనకు అవకాశమున్న చిత్రాలనే అంగీకరించి, పది కాలాలపాటు సజీవంగా వుండే పాత్రలను ధరించాలని ఆశిస్తున్నాను. అలాగే హిందీలోనే కాక తెలుగులో కూడా ఎక్కువ చిత్రాలలో నటించాలని కోరుకుంటున్నాను

—జి సాయిశ్రీనివాస్, గజ్జరం

సాహసవీరుడు, సకల గుణోద్ధాముడు, కరుణా హృదయుడు, మల్లెపూవంటి మనసు కలవాడు అయిన సూపర్ స్టార్ కృష్ణ నా అభిమాన నటుడు కావడం నేను గర్వించదగ్గ విషయం. కృష్ణగారు





ఇంతవరకు నటించిన చిత్రాలన్నీ వైవిధ్యంతో కూడుకున్నవేనని నిస్సంకోచంగా చెప్పగలను. నిజ జీవితంలో కృష్ణగారు చూపే ధైర్య సాహసాలు, ఆయన ఆశ (యా) లు, ఆదర్శాలు అటు సినీ పరిశ్రమలోనూ, ఇటు అభిమానుల హృదయాల లోనూ ఒక ఉన్నత స్థానాన్ని సంపాదించు కున్నాయనడంలో అతిశయోక్తి లేదు. కృష్ణగారు సినీ పరిశ్రమలో మకుటం లేని మహారాజు అనడం సబబుగానే ఉంటుంది. కృష్ణగారు ఇక ముందు గూడా మంచి వైవిధ్యమున్న పాత్రలలోనే నటించి, మంచి కథాబలంతో కూడిన చిత్రాలకు దర్శక బాధ్యతలు వహించి మాలాంటి అభిమానుల హృదయాలని రంజింప చేయగలరని ఆశిస్తున్నాను.

—జి. లత, గాజువాక విశాఖపట్నం

* * *

డేరింగ్, డ్యాషింగ్, డైనమిక్ హీరో "చిరు" అంటే నాకెంతో అభిమానం. చిరంజీవిగారి సినిమా చూస్తుంటే కాలమే తెలియదు. మొన్నటి ఖైదీ అయి మహానగరంలో మాయగాడుగా మారి చట్టంతో పోరాటంచేసి, చిరంజీవిలా" చిత్రసీమలో పులిలా విజృంభించి రక్తసిందూరమ్మై అడవి దొంగగా మారి, చిత్రసీమనే ఛాలెంజీగా తీసుకొని, కిరాతకుడుగామారి విజేతగా అందరిచేత ప్రశంశలందుకుని, మగధీరుడు అనిపించుకొని, కొండవీటి రాజాగా, అశేష ప్రేక్షకుల





హృదయాలలో నిలిచిపోయిన చంటబ్బాయి మ చిరంజీవిగారు త్వరలో సూపర్‌స్టార్ కావాలని కోరుకొనుచున్నాము.

జి కృష్ణకుమారి, అమ్మనబ్రోలు

# హైదరాబాదు నోట్‌బుక్

## శ్రీ ఆనంద సాధలే .

నేను సత్యాహింసా సిద్ధాంతాలను విశ్వసించను మనం కృష్ణుని రాజనీతి తత్వాన్ని అనుసరించాలని బావిస్తున్నాను దర్మరాజు చెప్పిన వయం పంచాదికం శతం (కౌరవులతో పాటు మేము నూట అయిదు మందిమి) అనే విచిత్రమైన అదర్శాన్ని అనుసరించడం వల్ల మనం ప్రతి వేయి సంవత్సరాలకు వేయి మైళ్ల ప్రాంతాన్ని కోల్పోతున్నాము చివరకు మన అస్తిత్వాన్నే కోల్పోతాము వాస్తవాన్ని గుర్తించి ఎదుర్కోకపోతే ఆ దుస్థితి తప్పదు కర్ర గల వానిదే బర్రె అనే పాఠమే కొందరికి తెలుసు వారికి ఆ పాఠంతోనే బుద్ధి చెప్పాలి- అంటారు పది సంవత్సరాలుగా హైదరాబాదులో స్థిరపడిన విఖ్యాత మహారాష్ట్ర రచయిత శ్రీ ఆనంద సాదలే తెలుగునాడులో ఎదో గొప్ప ఆకర్షణ వుంది తెలుగునాడుకు వలస వచ్చిన అన్య రాష్ట్రీయులు- తమిళులు కన్నడులు గుజరాతీలు మహారాష్ట్రులు ఎంజాబీలు బుందేలీలు- ఇక్కడే స్థిరపడి పోతారు తమతో పాటే రాష్ట్రాన్ని సంపన్నం చేసి మురిసి పోతారు మహారాష్ట్రులతో మనకు సంబందం సహస్రాబ్దాల నాటిది జైన బౌద్ధాలతో ప్రాకృత సంస్కృత బాషా సాహిత్యాలతో జ్యోతిష దర్మ శాస్త్రాలతో మహారాష్ట్రుల సంబందం మనకు ఘనిష్ఠమైంది తెలుగు దేశానికి మహారాష్ట్రం నుంచి వచ్చిన క్షీరసాగర బాస్కర అప్పే ఏక్‌బోటే టోణపె వైద్య దివాకర్ పటాలే మున్నగు వంశాలు స్థిరపడి పోయి తెలుగు సంస్కృతి మహాదారలో కలిసి పోయాయి శ్రీ ఆత్మారామ్ నీలకంఠ్ అనే నామాంతరం గల ఆనంద సాధలే కూడా అలాటి వారే తెలుగు రాజదానిలో వుంటూ మహారాష్ట్ర సాహిత్యాన్ని వృద్ధిపరుస్తూ తద్వారా ఆంధ్ర మహారాష్ట్ర సామరస్యాన్ని సాధిస్తున్నారు శ్రీ ఆనంద సాదలే సింధు ధుర్గ్ జిల్లా కూడల్ తాలూకా సాల్‌గాంవ్‌లో 1920 జులై 5వ తేది జన్మించారు బొంబాయి విశ్వ విద్యాలయంలో సంస్కృత మహారాష్ట్ర సాహిత్యాలు ప్రధానంగా పట్టబద్రులయ్యారు బొంబాయిలోని కేంద్ర టిలిగ్రాఫ్ ఆఫీసులో పని చేసి, 1976లో ముందుగానే రిటైరయ్యారు హైదరాబాద్ చేరారు స్థిరపడ్డారు శ్రీ సాదలేకు చిన్ననాటి నుంచే రచనాసక్తి ఉంది 1935లో - పదిహేనవ ఏటనే- రచన ప్రారంభించారు ఒక హిందీ కథను మరాఠికి అనువదించడంతో రచనా వ్యాసంగం ప్రారంబమైంది ఇది బహిరంగంగా రచనారంబ కాని అంతకు ముందు స్థానిక పత్రికలలో కవితలు ప్రచురించారు 1945లో లడాయీ సంపోల్యావర్ (యుద్ధానంతరం) అనే సాంఘిక నవలను ప్రచురించారు 1935 నుంచి 1947 వరకు కొన్ని వందల కథలు వివిధ పత్రికలకు వ్రాశారు ఇదంతా ప్రతిపలం లేని సేవ అప్పట్లో మహారాష్ట్రంలో రచన వృత్తిగా అబివృద్ధి చెంద లేదు కొందరు గొప్ప కథా రచయితలు మాత్రమే కథకు 20 రూపాయల ప్రతిఫలం పొందేవారు పత్రికా సంపాదకులు కథలు నవలలు వంటి కల్పనా రచయితలను తక్కువగా చూచేవారు వారి నిరసన స్వబావాన్ని చూచి కష్టపడి 1947 నుంచి 1958 వరకు రచనా వ్యాసంగమే మాని వేశారు శ్రీ సాదలే కాని ఈ పదకొండు సంవత్సరాలూ సంస్కృత సాహిత్యాన్ని - ముఖ్యంగా రామాయణ మహాబారతాలను కూలంకషంగా అద్యయనం చేశారు ఆ పరిశ్రమతో ఉదయించిన నవనీతంగా యాభై వేల పంక్తుల రామాయణ కావ్యం రచించి ఒక పత్రికలో దారావాహికంగా ప్రచురించారు దనాబావం వల్ల పాఠకులకు అభిరుచి లేనందువల్ల దానిని పుస్తక రూపంగా ప్రచురించలేక పోయారు పిదప భాగవతంలోని



శ్రీ ఆనంద సాధలే

రాసక్రీడపై పరిశోధన వ్యాసాన్ని దీపావళి అనే సుప్రసిద్ధ పత్రికలో ప్రచురించారు వెంటనే దానికి గుర్తింపు వచ్చింది పండితులు సాహిత్య జిజ్ఞాసువులూ తలలెత్తి చూచారు దాని తర్వాత పదకొండు మంది ప్రముఖ సంస్కృత కవులను పరిచయం చేస్తూ అమృత్ మేఘ అనే గ్రంథం ప్రచురించారు దీనిలో వర్ణ చిత్రాలు కూడ ఉన్నాయి దీనిని పాఠకులు బాగా అదరించారు అటుపిమ్మట వెలువడిన మహా గ్రంథం హా జయ నామ్ చా ఇతిహాస్ ఆహె (ఇది జయ అనే పేరు గల ఇతిహాసం) ఇది వ్యాస మహా భారతంపై గొప్ప వ్యాఖ్య యుధిష్ఠిరుని అహింసా సిద్ధాంతాన్ని ఇది ఖండిస్తూ యే యథామాం ప్రపద్యంతే తాన్ తథైవ బజామ్య హమ్ అనే కృష్ణుని సిద్ధాంతాన్ని సమర్థిస్తుంది ఇది హిందూ ముస్లిం సంబంధాల దృష్టితో రాజకీయంగా వ్యాఖ్య వంటిది కూడ ఈ మహా వ్యాఖ్యను మహారాష్ట్రులు బాగా అదరించారనడానికి ఇది మూడు ముద్రణలు పొందడమే సాక్ష్యం రామాయణ భారతాలలో చరిత్ర బీజాలున్నాయని నేను భావిస్తున్నాను ఈ గ్రంథంలో నేను దర్మ యుద్ధానికి, యుద్ధ దర్మానికి గల వ్యత్యాసాన్ని స్పష్టపరచాను యుద్ధాలలో గెలుపు ధర్మ యుద్ధం వల్ల కాదు యుద్ధ ధర్మం వల్లనేనని నానిశ్చయం- అంటారు శ్రీ సాధలే సంస్కృత కావ్యాలన్నిటినీ ఆయన నవలలుగా రచించారు ఇవి చాల జనప్రియంగా ఉన్నాయి ఈ విదంగా కుమార సంబవం వాసవదత్త వసంతసేన మాలవిక మాలతి ద్రౌపది (వేణీ సంహారం) శకుంతల అనే పేర్లతో నవలలుగా పుంఖాను పుంఖంగా ప్రచురించారు దశోపనిషత్తులను సరళ వచనంలో వ్రాశారు గీత గోవిందాన్ని యదామూలంగా సరళ సుందరంగా అనువదించి మూలంతో పాటు ప్రచురించారు ఇది శివాజీ విశ్వ విద్యాలయంలో ఎం ఎ కు పాఠ్య గ్రంథంగా నిర్ణీతమైంది ఇలాగే పంచతంత్రం హితోపదేశం మున్నగునవి అనువదించారు ఇలా కథాసంపుటాలు నవలలు నాటకాలు జీవిత చరిత్రలు- కవిత తప్ప- దాదాపు 60 గ్రంథాలు రచించారు సంస్కృత సాహిత్యాన్నంతా నవలా రూపంలో మరాఠీ చేయాలని పూనుకున్నారు ఈలాటి నవలలు ఇంతవరకు 25 వచ్చాయి ప్రస్తుతం రఘువంశాన్ని, వాత్స్యాయన కామ సూత్రాలను నవలలుగా మలుస్తున్నారు షెడ్యూలు కులాలతో పాటు హిందూ హిందూయిజం అంతా ఒక్కటేనని నా విశ్వాసం కౌరవులు ఒక్క కర్ణుని బలంపైనే యుద్ధం చేశారు కర్ణుని మొదటి నుంచి గౌరవంగా చూచి వుంటే చరిత్ర రూపే మారిపోయి వుండేది మహాబారతం నుంచి మనమేమి నేర్చుకోలేదు మన శంకరాచార్య పీఠాలు హిందూమతాన్ని పటిష్ఠం చేయడానికి తమ కర్తవ్యం నిర్వహించడం లేదు వారు అంబేద్కర్‌ను గౌరవించ లేదు అంబేద్కర్ ప్రస్తుత కాలపు కర్ణుడయ్యాడు హిందువులలో చాల మంది తమ మాతృ మతాన్ని వదలి వెళ్లారు అనాడు మహాబారత యుద్ధం ఎంత హానికరమైందో ఈనాడు ఈ ప్రజాస్వామ్య యుగంలో ఇది అంతటి హానికరం అంటారు ఆయన శ్రీ సాధలేకు స్త్రీలంటే అపారమైన గౌరవం ఒక పూవు పూచింది అనే కథలో శ్రీ గుడిపాటి వెంకటచలం ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని ఆయన చాల సమర్థిస్తారు పురుష ప్రాధాన్యమున్న సంఘం స్త్రీ పవిత్రతను గురించి పురుషానుకూలమైన దర్మ సూత్రాలు రూపొందించుకొంది దానివల్ల మహిళలు బానిసల దశకు దిగజారారు ఇలా అనడం వల్ల నేను మహిళల స్వైరవిహారాన్ని సమర్థిస్తున్నానని భావించకండి నా ఉద్దేశంలో మహిళలు పురుషులతో సమానులు నిజానికి వారికన్నా గొప్పవారు కనుక వారిని గౌరవించి వారు స్వయంగా నిర్ణయాలు చేయడానికి స్వేచ్ఛ ఇవ్వాలి- అంటారు శ్రీ సాదలే'


రోజూ స్కూలు అయిపోగానే, మా స్నేహితులతో కలిసి, గ్రౌండ్‌కి వెళ్ళి బాస్కెట్ బాల్ ఆడుకుంటాను. ఒకసారి గ్రౌండ్‌లోకి వెడితే, అలిసిపోయి, కదలలేనంత వరకు ఆడతాము. అయితే ఏం? ఇంటికి వెళ్ళగానే మా అమ్మ నాకు ఒక కప్పు హార్లిక్స్ యిస్తుంది. అహా, శక్తినిచ్చే పానీయం, హార్లిక్స్! నిజంగానే బలే రుచిగా ఉంటుంది.
మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం.
పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు. 100 సంవత్సరాల్కు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?
Horlicks
The Great Nourisher
కొత్త సమయం,
కొత్త రూపం
మంచి పుష్టికరమైనది
HMM 9044TEL










విజయవాడలో ఇటీవల బెజవాడ లయనెస్ క్లబ్ జిల్లా ప్రెసిడెంట్ శ్రీమతి కె కాంచనమాల ద్వారా వికలాంగురాలు కుమారి పద్మావతి కుట్టుమిషను స్వీకరిస్తున్న దృశ్యం క్లబ్ అధ్యక్షురాలు శ్రీమతి పి శ్యామలని కూడా చిత్రంలో చూడవచ్చు

# హైదరాబాద్ నోట్‌బుక్

రామాయణంలో ఉత్తరకాండ ప్రక్షిప్తమని నా నమ్మకం రామునివంటి వాడు సతను అందులోను గర్భిణిని అడవులకు పంపడు సంఘంలో స్త్రీలు కొంచెం మిడిసపడే పరిస్థితి వచ్చి వుంటుంది దానిని అరికట్టడానికి ఎవరో సీతకు ఈలాటి శిక్ష విధిద్దామనుకుని తద్వారా స్త్రీలకు బుద్ధి చెబుదామని బావించి ఉత్తరకాండను అల్లి వుంటారు- అని ఆయన విశ్వాసం ఆయా కాలానుగుణంగా కొందరు ఉద్భవించి సంఘంలో మార్పులు తెస్తారు ఏకనాథుడు తన కాల పరిస్థితిని బట్టి మత సామరస్యాన్ని సమర్థిస్తూ రామాయణం రచించారు ఇది ఎక్‌నాద్ రామాయణమని పేరు పొందింది మనం కర్మణ్యులమై విదేశీయులతో పోరాటం సాగించ వలసి వచ్చింది బాలగంగాధర తిలక్ బగవద్గీతకు కర్మయోగ ప్రాదాన్యంగా వ్యాఖ్య రచించారు అది స్వాతంత్ర్య సమరానికి ఎంతో బాసట అయింది- అని ఆయన వివరిస్తుండగా ఇప్పుడేమి సిద్ధాంతం మనది?- అని ప్రశ్నించాను ఇప్పుడు తినడం వైయక్తికంగా పొట్టలు నింపుకోడం పెంచుకోడం దేశం జాతి అనేదేమి లేదు రాజకీయంగా గాని ఇతరత్రా గాని సిద్ధాంత మనేది గాని విధాన మనేది గాని ఏదీ లేదు ఉన్నదల్లా తాను పెరగడం ఎలా అనేదే- అని ఆయన ఆవేదన ప్రకటించారు దీని పర్యవసాన మేమి?- అని ప్రశ్నించాను పుట్టుకొని వస్తుంది ఏదో సిద్ధాంతం లేకపోతే దేశం చిన్నాభిన్న మవుతుంది దానిని ప్రతిఘటించ డానికి మనం సన్నద్ధులమై వుండాలి – అని దృఢ నిశ్చయంతో అన్నారు శ్రీ ఆనంద పాదలే

## ఉపశ్రుతి –

అది చేయాలి ఇది చేయాలి ఏమేమో చేయాలి- అంటూ ఒకరు చెప్పుకు పోతున్నారు ఒక గోష్ఠిలో అంతా విని సోదరి శ్రీమతి రాంబట్ల సుబద్రమ్మ చింతకాయలకు అజ్ఞగాని గుటకలకు అజ్ఞ ఏముంది? అని పాత సామెతను చెప్పారు

– తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd ,
by S Nageswara Rao at the Andhra Patrika Press,
Gandhinagar, Vijayawada 3, Editor S Radhakrishna
Phones Business 61247, 61248, Editorial 75667







# ఈ రోజును
# సూపర్ ఫ్రెష్ రోజుగా చేసుకోండి.

## కొండలోయల పుష్పాల పరిమళంతో

సూపర్ ఫ్రెష్ సహజమైన హాయనిపించే సుఖానుభూతిని
చేకూర్చే సుగంధ భరిత క్రొంగొత్త సబ్బు మీచర్మానికి మృదుత్వాన్ని
చేకూర్చి మీకు ఉల్లాసాన్ని కొనితెస్తుంది
అందుకే కొద్దిగా తాజాదనాన్ని జల్లుకోండి
ఈ రోజును సూపర్ ఫ్రెష్ రోజ గా తీర్చుకోండి

949/TL

# లాటరి

ముసునూరి పేరయ్యశాస్త్రి

రామయ్యగారు వచ్చి పిలిస్తే గానీ ఆయన భార్య పార్వతమ్మగారు వాస్తవంలోకి రాలేదు తీరా వచ్చాక ఆలశ్యంగా వస్తానని చెప్పి వెళ్ళిన ఈ మనిషి యింత అర్జంటుగా ఎందుకు వచ్చాడో ఆవిడకర్థంగావడంలేదు

కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టు నెమ్మదిగా అడిగి పడక కుర్చీలో మేను వాల్చారాయన బరువుగా కళ్ళు మూసుకొన్నారు చమటతో తడిసిన లాల్చీ వంటినంటుకొని పోయింది

ఇవిగో మంచినీళ్ళు

ఆయన గ్లాసందుకొని గడగడా త్రాగేశారు

ఏదో అడగాలనుకొంటున్న ఆమె మాటలు గొంతుదాటి రావడంలేదు విచారంగా నిస్తేజంగా వున్న భర్త ముఖం చూస్తున్న ఆవిడకు తన ప్రశ్నకు వ్యతిరేకంగానే వస్తుందని ఊహించుకొని- అయినా అణచుకోలేని ఆవిడ ఆతృత ఈ రోజు ఉత్తరం రాలేదా అని అడిగింది

రామయ్యగారు గ్లాసు క్రిందపెడుతూ రాలేదు అనేసి కళ్ళు మూసుకొన్నారు

ఆమె నిరాశపడలేదు

ఎందుకంటే ఆ జవాబు ఆమె ఊహించినదే!

పద్మ వెళ్ళి అప్పుడే పదిరోజులు కావలసి వస్తోంది క్రొత్త కాపురం క్రొత్త మనుషులు క్రొత్త ప్రదేశం ఎలా వుందో దాని కాపురం

ఎన్నో ఆలోచనలు

ఎన్నెన్నో ఊహలు

ఆ వృద్ధ దంపతులకిద్దరే సంతానం ఒకకూతురు ఒక కొడుకు కొడుకు రవి విశాఖపట్టణంలో పి హెచ్ డి. చేస్తున్నాడు కూతురు పద్మకి పదిరోజుల క్రితమే పెళ్ళిచేసి పంపించారు పెళ్ళిన రెండ్రోజులకే తలిదండ్రులని అత్తమామలని వదలి తిన్నగా భర్తతో వెళ్ళిపోయింది అందులో దూరాభారం అల్లుడు ప్రదీప్ కలకత్తాలో పని చేస్తున్నాడు అతనెటువంటివాడో అమ్మాయిని సరిగా చూస్తున్నాడో లేదో త్రాగుబోతేమోపేకాట ఆడి అర్ధరాత్రుళ్ళు ఇంటికివచ్చి దాన్ని చంపుకుతింటాడేమో!

ఆడపిల్ల జీవితమో లాటరి

ఆ లాటరీలో గెలుపు ఓటములు ముందుగా ఎవరు చెప్పగలరు! భర్త మంచివాడైతే సంతోషిస్తుంది చెడ్డవాడైతే ఇంతే ప్రాప్తమని సర్దుకు పోతుంది



పద్మ నుంచి ఉత్తరం వస్తుందని అందులో తన భర్త మంచివాడని- ఎంతో ఉన్నతమైన మనస్సు కలవాడనీ- ఏ చెడు అలవాటు లేనివాడని వ్రాస్తుందని-' ఆ ఉత్తరం చూసి తాము తృప్తి పడాలని వారి ఆశ కూతురి వైవాహిక జీవిత ప్రారంభంలో కూతురి నుంచి అటువంటి ఉత్తరమే రావాలని వారు కనిపించిన ప్రతీ దేవుడికి మ్రొక్కుకొంటున్నారు

రోజులు గడుస్తున్నాయి

రామయ్యగారు పోస్టాఫీసుకు రోజూ వెడుతున్నారు నిరాశగా తిరిగి వస్తున్నారు ఏవో ఉత్తరాలు వస్తున్నాయిగానీ కూతురి నుంచి మాత్రం రావటంలేదు క్రొత్తగా కాపురానికి వెళ్ళిన కూతురి నుంచి తను వ్రాసే మొదటి ఉత్తరం కోసం తల్లితండ్రులు ఎదురు చూస్తారనే విషయం దానికి తెలియదాని ఆ దంపతులు వాపోతున్నారు

అందులో ఈ రోజు విన్న వార్త పార్వతమ్మగార్ని మరింత కృంగదీస్తోంది ఆ వార్త గురించే ఆలోచిస్తున్నారావిడ ప్రక్కింటి పిన్నిగారు ప్రొద్దుట వచ్చి పాపం మన రాఘవయ్య మాష్టారి అమ్మాయి మొగుణ్ణి వదిలేసి వచ్చేసిందట అని చెప్పింది

ఏం పాపం ?

ఏముందీ మామూలే! ఆ పిల్ల మొగుడు త్రాగుబోతుట ఆ పిల్లను గొడ్డును బాదినట్లు బాదుతాట్ట భరించలేక లేచి చక్కా వచ్చేసిందట

అయ్యో పాపం పెళ్ళైరెండే నెలలైంది

అంతే ఏ జీవితాలో నమ్మా పుణ్యంకొద్ది పురుషుడని అయినా పిల్లల్ని కనగలంగానీ వాళ్ళ



రాతల్నెలా కనగలం

ఆ మాటలే పార్వతమ్మగారి చెవుల్లో గింగుర్లు ఎదుతున్నాయి ఒక్కగా నొక్క కూతురు పద్మ గురించే ఆమె దిగులు ఎంతో గారంగా పెంచారు ఆమె జీవితంలో సుఖపడాలని దేనికి లోటు లేకుండా హాయిగా ఉండాలనీ కష్టమైనా మంచి సంబంధం తీసుకువచ్చి చేశారు కుర్రవాడు మంచివాడేనని అందరూ చెప్పారు కానీ తలిదండ్రులకెంతో దూరంగా ఉంటున్న అతని మంచి చెడ్డలు ఇక్కడి వాళ్లెలా చెప్పగలరు? అసలు వ్యసనాలు ఉండకూడదుగానీ ఉంటే ఆ సంసారాలు సారంలేనివైపోతాయి ఆ ఇంటి గృహిణికి రోజూ ఒక నరకమై పోతుంది

పార్వతీ

ఉలిక్కిపడి చూసారామె ఎదురుగా భర్త రామయ్యగారు ఆయన ముఖం పున్నమినాటి చంద్రునిలా వెలిగిపోతోంది ఆయన చేతిలో ఇన్‌లాండ్ లెటర్ గాలికి రెపరెప లాడుతోంది

ఉత్తరం వచ్చిందా అడిగారామె

ఆ వచ్చింది

ఆమె లేచి నిలబడి కులాసాగా ఉన్నారా' అని అడిగారు తనలోంచి ముంచుకొస్తున్న కంగారును అణచుకొంటూ

రామయ్యగారు వచ్చి నేనూ చదవలేదు ఉత్తరం చదవాలంటే నాకూ ఎదో కంగారుగా ఉంది ఇద్దరం కలసి చదువుకోవచ్చని చించకుండా వచ్చేసాను అన్నారు

ఆమె మరింత కంగారు పడిపోయి ఈ సంగతి మిరు విన్నారా' మన రాఘవయ్యగారి అమ్మాయి మొగుడు మంచివాడు కాదట ఆ పిల్ల మొగుణ్ణి వదలి వచ్చేసిందట అని చెప్పగానే ఆయన వెంటనే ఉత్తరాన్ని చింపి- వేగంగా చదువుకోసాగారు లోపలే' భర్త ముఖంలోని భావాన్ని చూస్తూ కూతురి భవిష్యత్తును అంచనా వేస్తున్నారు పార్వతమ్మగారు రామయ్యగారు పూర్తిగా చదివి పార్వతీ' మన పద్మ చాలా అదృష్టవంతురాలు మన పద్మ లాటరిలో గెలిచింది మనల్లుడు చాలా మంచివాట్ట కనీసం సిగరెట్టు కాల్చడట

అమ్మయ్య కుర్రవాడు మంచివాడని ఎందరు చెప్పినా- ఏదో అనుమానం మనసులో పీకుతూనే ఉండేది ఇప్పుడు హాయిగా ఉంది ఇదిగో ఉత్తరం చదువుకో ముందులేచి అన్నంపెట్టు ఆనందంగా- తృప్తిగా భోజనంచేసి చాలా రోజులైంది పెళ్ళి ముందు పనులకు హడావిడి- పెళ్ళిలో మగపెళ్ళికెక్కడ లోటువస్తుందోనన్న బెంగ పెళ్ళయిన అల్లుడెటువంటివాడోనని కంగారు ఇప్పుడు ఎ చింతాలేదు అని అంటున్న భర్త కళ్ళలోని వెలుగును తృప్తిగా చూస్తూ పార్వతమ్మగారు లేచారు □

## అంకితం

అవార్చుల రాజు సుచిత్రా ఎలక్ట్రానిక్స్ ఎం డి శ్రీ కృష్ణంరాజుగార్కి గౌరవంతో ఈ చిన్న కథా కుసుమం

రచయిత



హిందీ చిత్రం ఓకేపాట లో మీనాక్షిశేషాద్రి

# సినిమా

(58 వ పేజీ తరువాయి)

## వేజెళ్ళ చిత్రం "మట్టి గంటలు మారుమ్రోగితే ...?"

"గ్రామాలలో నేటికీ మట్టి మనషులుగా పరిగణింపబడే పీడిత ప్రజానీకం చేత వెట్టిచాకిరి చేయించుకుని, వారి స్వేదంతో మేడలు నిర్మించుకోవడమే గాక వారి స్త్రీల మానంతో కూడా ఆడుకుంటున్నారు కళ్ళు కప్పిన భూస్వాములు. అలాంటి దారుణకాండకు బలియైన ఓ మట్టి అబల సబలగా మారి, ఆ మట్టి మనుషుల గళాలు గంటలుగా మారుమ్రోగితే, నరరూప రాక్షసులకు వినాశం తప్పదు అనే ప్రాతిపదికపైన అల్లబడిన కథ. మే 10 నుంచి పాలమూరు, తణుకు, గుమ్మళ్ళదొడ్డి ప్రాంతాలలో ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది. ప్రముఖ నాటక రచయిత ఇసుకపల్లి మోహన్‌రావును సంభాషణల కర్తగా పరిచయం చేస్తున్నాం," అన్నారు వేజెళ్ళ సత్యనారాయణ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి. కామేశ్వరరాజు, ఐ. బాబ్జి నిర్మిస్తున్న శ్రీ సౌమ్య చిత్రవారి పై చిత్రంలో విద్యాసాగర్, సాగరిక, రంగనాథ్, వేలు, బ్రహ్మానందం, సుబ్బరాయశర్మ, సుబ్రహ్మణ్యం, చంద్రిక, కావ్యం, ఝాన్సి, దేవి నటిస్తున్నారు. ఒలేటి పార్వతీశం, పప్పు వేణుగోపాలరావు, శశిధర్ గీతాలకు రమేష్‌నాయుడు బాణీలు కూర్చారు. హరనాథ్ ఛాయ. కోదండం శిల్పం, వర్మ నిర్వహణ, మురళి - రామయ్య కూర్పుతో వి. నరసరాజు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

## కృష్ణ, జి. రామ్మోహనరావు కాంబినేషన్‌లో "శాంతినివాసం"

"ఏప్రిల్ 20 నుంచి నెలాఖరు వరకు మొదటి షెడ్యూల్ పూర్తయింది. మే 26 నుంచి జూన్ 5 వరకు ఊటీలో సాంగ్స్ పిక్చరైజేషన్, జూలై మాసాంతానికి షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు జి. రామ్మోహనరావు. ఈయన దర్శకత్వంలో అంగర సత్యం నిర్మిస్తున్న రాజ్యలక్ష్మి మూవీస్ వారి "శాంతినివాసం"లో కృష్ణ, సుహాసిని, రాధిక, సత్యనారాయణ, కాంతారావు, జయంతి, వై. విజయ, అడిగాగల వారు పాల్గొంటున్నారు. భీశెట్టి కథకు సత్యానంద్ సంభాషణలకర్త. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, ఎ. ఎస్. ఆర్. స్వామిఛాయ చల శిల్ప జగదీశ్‌రెడి ఎ యుక్త దర్శకత్వ ఫ్రైడిబాబు సహకార దర్శకత్వం ద డమూడి కోటేశ్వరరావు నిర్వహణతో అ గర విజయకుమార్ ఎగిక్యూటివ్ ప్రొడ్యూసర్ □


ఎండా కాలం అయితే మాత్రం ఈ వేషంలో తిరగాలా!!
మా ఊళ్లో ఎండలు కొంచెం ఎక్కువ బైట ఎక్కువ తిరగొద్దని చెప్పాను కదా మామగారూ..
నేను మా ఆఫీసులోనే కూర్చుంటా!

# గోద్రెజ్ సృష్టించింది సుఖవిలాసాలకు శిఖరం మార్వెల్ లగ్జరీ సోప్



## మాత ఎవరు ?

25-4-86 తేది సంచికలో అరవిందాశ్రమంలోని మాత ఎవరు?- వ్యాసంలో అనేక సత్యదూరమైన విషయాలున్నవి అనంతంగా వస్తున్న శ్రీ అరవిందాశ్రమ సాహిత్యంతోగాని ఆశ్రమంతోగాని రచయితకు కనీసం పరిచయం ఉన్నట్లు కనిపించదు శ్రీ మాత మహాసమాధి (1973) అనంతరం ఆశ్రమంతో విరోదబావం పెంచుకొని దుష్ప్రచారం చేస్తున్న సత్‌ప్రేమ్ అనే ఫ్రెంచి దేశస్తుని మురాకు చెందిన సుజాతనవార్ వ్రాసిన క్రానికల్స్ గాని సత్‌ప్రేమ్ వ్రాసిన ఎజెండా గాని ప్రమాణాలుగావు ఆశ్రమం ట్రస్టు వాటిని బహిష్కరిస్తూ ఈ సంగతి ప్రకటించారు ప్రముఖులైన ఆశ్రమవాసుల్లో కొందరు వాటిని ఖండించారు కూడా ఈ సంగతి రచయితకు తెలియదు కాబోలు ఆశ్రమం ఇతర కేంద్రాలు ప్రచురించిన అనేక శ్రీమాత జీవితచరిత్ర గ్రంథములున్నవి శ్రీ అరవిందుల శత జయంతి సంపుటాలు 30లో 25వ సంపుటంలో శ్రీ మాతను గురించి విపులంగా వారు వ్రాశారు మహనీయుడైన శ్రీ అరవిందుల వాక్యాలే ప్రమాణాలుగాని అసూయాద్వేష మాత్సర్య ద్రోహబుద్ధితో విరోదబావంతో వ్రాసిన అసత్యాలు ప్రమాణం గాజాలవు తెలియని సామాన్య పాఠకులు అవి చదివి నిజమే కాబోలు అని అపోహపడే ప్రమాదం వుంది అవతారాల మహాత్ముల జీవితాల్లో అనాదిగా ఇది జరుగుతూనే వుంది శ్రీకృష్ణుని జారుడు చోరుడు గురుదేవ శూన్యుడు కులగోత్ర రహితుడు అని ఆ నాడు కొందరు నిందించలేదా? బీష్మాదులు బగవంతుని కీర్తించలేదా? సత్యాన్ని గుర్తించాలి అవగాహన సుహృత్‌బావం వుండాలి ఇక వ్యాసంలో కొన్ని అసత్య విషయాలు

అర్ధ శతాబ్దికి పైగా అశేష జనహృదయాల్లో మాతృస్థానం పొందగలిగిన వ్యక్తి మాతగాక

## ఉత్తరాలు

ఇంకెవరు? రచయిత సందేహించినట్లు మాత ఎవరు అన్న ప్రశ్నకు అవకాశం లేకుండా చేసింది అనే విషయమే అసంగతం అనవసరం అరవిందుని గీతాచరణ సాహచర్య ప్రబావంగాబోలు అని ఆశ్చర్యార్థకం వుంచటం సమంజసంగాదు ఉత్తమ సంస్కృతిగాదు దానికి అర్థమేలేదు! ఈ మాత అనిబిసెంట్ నివేదితల్లా బారతీయురాలుగాదు అనేశారు ఇది తప్పు 1954 ఆగస్ట్ 15 నాడు శ్రీ మాత బారత జాతీయత పౌరసత్వం స్వీకరించారు అప్పట్లో ఈ డిక్లరేషన్ ఆలిండియా రేడియో ప్రసారం చేసింది కూడా! (చూడుడు శ్రీ మాత శతజయంతి (1978) సంపుటం 13 పేజి 43) ఇక జీవిత చరిత్ర వివరాలు వ్రాస్తూ అనేక అప్రస్తుత అప్రదాన విషయాలు వ్రాయటం జరిగింది కొందరు శిష్యులు శ్రీ మాత జీవిత చరిత్ర వ్రాయాలనుకొని వివరాలు అడిగితే నా బౌతిక జీవిత వివరాలు అడగవద్దు అవేమంత ఆసక్తికరమైనవికావు అంటూ జీవితమంతా బగవదిచ్ఛ ప్రకారం బగవంతుడాదేశించినట్లే జీవించాను అదే ముఖ్యం అని వివరాలు చెప్పటం త్రోసిపుచ్చారు

ఇంక వ్యాసంలో మాత తల్లి కమ్యూనిస్ట్!(కృష్ణుని కౌరవులు యాదవుడని నిందించినట్లు) మాంసం కూర అంటే తెగ యిష్టపడేది (బాగవతంలో కృష్ణుడు మాగాయ పచ్చడి తిన్నాడు అని పోతన భక్తి బావంతో వ్రాస్తే ఓస్ కృష్ణుడేం దేవుడు అని అల్పులనుకొన్నట్లు) అని వ్రాశారు ఒకసారి శ్రీ అరవిందులు మొదట్లో మాంసం తింటారని చుట్ట గాలుస్తాడని ఎవరో బగవాన్ రమణ మహర్షితో హేళనగా అన్నప్పుడు అన్నవారిని వీడో గురుద్రోహి అన్నారట మహర్షి ఆద్యాత్మిక విషయాలు అంతుబట్టవు సామాన్య మేదకు అరవిందుడు బ్రిటిష్ ప్రభుత్వానికి వెరచి పాండిచేరి పారిపోయాడని అనుకొనే మూర్ఖులు కొంతమంది ఉన్నారు మహోన్నతమైన జీవితాన్ని త్యాగంచేసి విప్లవవీరుడుగా ఉగ్రవాదిగా స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపిన అరవిందుడు పారిపోతాడా? జైల్లో దివ్యాదేశాన్ని పాటించి పాండిచేరి వెళ్ళినట్లు ఆయన తెలియజేశారు లోకం కీర్తించే సుబాస్ చంద్రబోస్ బారతదేశాన్ని ప్రేమిస్తాను అరవిందుడిని ఆరాదిస్తాను అన్నాడు శ్రీ అరవిందుల రచనలతో ఇంగ్లాండ్ ఐ ఎ యస్ కు చదువుతుండగా ప్రబావితుడైనాడు బోస్

మాత అరవిందాశ్రమాన్ని ఆశ్రయించలేదు అరవిందాశ్రమం జన్మించటానికి కారణం మాత 1920లో ఆశ్రమాన్ని స్థాపించి పెంచి అరవింద నిర్యాణానంతరం ధైర్యంతో బహుముఖంగా ఆశ్రమాన్ని అభివృద్ధి చేశారు శ్రీ మాత ఇది జగద్విదితం వ్యాస రచయిత కె ఆర్ శ్రీనివాస అయ్యంగార్ వ్రాసిన శ్రీ అరవింద జీవితం (శ్రీ అరవిందులు ఎ హిస్టరి ఎండ్ ఎ బయాగ్రఫి) ది మదర్ ఎ క్రానికల్ ఎండ్ ఎ మానిఫెస్టేషన్ చదవటం మంచిది ఆసక్తి నిజంగా వుంటే సత్యం బోదపడుతుంది- సత్యాన్వేషణ చేయగల సమర్థత ఉద్దేశం ఉన్నప్పుడు అరవింద యోగిని మాయం చేసింది అనటం హాస్యాస్పదంగా కన్పిస్తుంది

ఈమె బోదనలు ప్రత్యేకమైనవిగా కన్పించవనటంలో వాస్తవంలేదు అరవిందుని కలియకపూర్వమే 1912 లోనే ఆమె ఒక ప్రణాళిక నేర్పరచుకొంది జపాన్‌లో కలిసినప్పుడు రవీంద్రుడు మాతను శాంతినికేతన్ ఆధ్వర్యం వహించమని కోరాడు కాని ఆమె నిరాకరించింది పారిస్‌లో అనేక సమావేశాల్లో ఆమె ప్రసంగించింది వర్డ్స్ ఆఫ్ లాంగ్ ఎగో పుస్తకంలో దినిని ప్రకటించారు

శ్రీ మాత శత జయంతి సంపుటాలు 15 సత్‌ప్రేమ్ మదర్స్ ఎజెండా 13 ఇంకా శిష్యుల గ్రంథాలు కొన్ని వందలు చదివితే తెలుస్తుంది ఆమె బోదనల విషయం శ్రీ మాతకు సంబంధించి గుప్త విషయాలు(?) లేనేలేవు! మాత జీవిత చరిత్రలోని వ్యక్తిగతమైన అంశాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వకుండా సంస్థాగతమైన బోదనల సారాన్ని వెలుగులోకి తీసుకురావాలి అంటూనే వ్యాసం నిండా అనవసర విషయాలు ప్రస్తావించారు! ఇది ఆశ్చర్యం

ఇది ఒక పుస్తక సమీక్షలా వున్నా వ్యాసరూపంలో పాఠకుల్ని తప్పుత్రోవ పట్టించి మాత విషయంలో మరబిప్రాయం కలిగించేదిగా వున్నందున స్వల్పంగా సమాదానించవలసిన అవసరం ఏర్పడింది శ్రీ



# త్వరలో ప్రారంభం!

సుప్రసిద్ధ రచయిత్రి

## రావినూతల సువర్ణా కన్నన్

కొత్త సీరియల్ నవల

# కరిగిన శిల

ప్రఖ్యాత రచయిత

## డా. కొత్త రవీంద్రబాబు

సరికొత్త సీరియల్

# సంకెళ్లు వరికి ?

రామకృష్ణ పరమహంస పిచ్చివాడు. వివేకానందుడు వెర్రివాడు రమణ మహర్షి జడుడు అరవిందుడు పాండిచేరి పారిపోయాడు మాత ఫ్రెంచి వనిత మాత్రమే అని కొందరు విమర్శించవచ్చు- కాని లోకానికి వారు దృవతారలు అవతారమూర్తులు- ఆద్యాత్మికసాదన పేరుతో అనేక వెర్రి ఉద్యమాలు పుట్టగొడుగుల్లా బయలుదేరుతున్న ఈ కాలంలో స్థిరమై సత్యమై నిల్చిన రామకృష్ణ మిషన్ రమణాశ్రమం శ్రీ అరవిందాశ్రమం వంటి ఆదర్శ సంస్థలే నిజమైన మార్గదర్శకాలు ప్రజలు దొంగసన్యాసుల బోదగురువుల చేతుల్లో పడకుండా జాగ్రత్తపడవలసిన కాలం యిది

మహనీయుల ఆదర్శజీవితాల్లో లోపం వుండదు అది మనలో లోపమే; సూర్యుడి వెలుగులో దోషంలేదు చూచేవారి దృష్టిదోషం మాత్రమే గ్రుడ్డివాడికి ఏదీ కన్పించదు

మాత ఎవరు? అనే ప్రశ్నకు అమె ఆద్యాశక్తి అని సమాధానించిన శ్రీ అరవిందుల వాక్యమే ప్రమాణం అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా!- అమె శ్రీ మాత అని జవాబు

–కె యస్ బాస్కరరావు హైద్రాబాద్

## ఆకర్షణీయం

తెలుగు తెరకు పరిచయమైన హింది నటి ఖుష్బు ముఖచిత్రము చాలా అకర్షణీయముగా వున్నది

–ఏ శివప్రసాద్ అవతేపల్లి

## రంజింప చేసింది

మలయ మారుతాలు వెదజల్లుతూ మదురమైన సువాసనలతో హింది నటి ఖుష్బూ ముఖచిత్రంతో వెలువడిన 25 ఎప్రల్ -1 మే ఆంధ్రసచిత్ర వారపత్రిక మా హృదయాలను రంజింపజేసింది

జిట్టా మణిమాల మోహన్ కడప

## సీరియల్

జీవితం చేజారిందా? సరియల్ చాలా బావుంది ముఖ్యంగా రాధిక మరణంతో సిరియల్ ఏ మలుపు తిరుగుతాదో అని ఆతృతగా ఉంది ఇంత మంచి సరియల్ అందించినందుకు రచయిత్రి గార్కి కృతజ్ఞతలు

ఆర్ మదుసూదన్ అంబుసోలి

* * *

నందమూరి బాల కృష్ణ విజయశాంతి ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో బలి కోరిన ప్రేమ ప్రేమసాగరం వసంతగితం సరియల్ నవలలు చాలా బాగున్నాయి

ఈ పత్రికలో సక్రట్ ఏజంట్ విక్రమ్ అను బొమ్మల సీరియల్ ఇంత త్వరగా ముగించడం చాలా విచారంగా ఉంది

–దువ్వాద శ్రీకాంత్ కాశీబుగ్గ

* * *

వీరపల్లి వీణావాణి గారి సర్పయాగం కొత్త సరియల్ ఆరంబంలోనే మనస్సును అద్భుతంగా ఆకట్టుకుంది క్రమంగా ఎలా ఉంటుందో! అనే ఆసక్తిని కల్పించారు

– ఆకెళ్ళ సుబ్బారావు కందికుప్ప

* * *

ప్రేమసాగరం సరియల్ చివరి బాగం చదువుతుంటే చెప్పలేని ఆవేశం వచ్చింది నాకు

తనని అన్యాయానికి బాధలకి గురిచేసె మగవాళ్ళకి (బర్తలకి) ఎదురొడ్డి పోరాడాలని తాపత్రయ పడుతుంది నేటి స్త్రీ ఆ విషయాన్నే దృష్టిలో ాట్టుకుని నవలని ముగించాల్సింది రచయిత్రి

చదువు ఎంతో ఆర్థిక సోమత సంఘంలో పరపతి స్వచ్ఛంధంగా ప్రేమించే వ్యక్తి తోడు ఉన్న స్వప్నలాంటి అమ్మాయి ఎవ్వరూ అర్థరహితమైన ప్రేమసాగరంలో పడి కొట్టుకుపోయి జీవితాన్ని అంతం చేసుకోరు కోరాదు

– జి అచ్చాయమ్మ గుంటూరు

* * *

బలి కోరిన ప్రేమ తో జీవితం చేజారిందా అని వాదపడు బానిస బ్రతుకులు లో ప్రేమసాగరం పొంగి వసంతగితం పాడింది బొంబాయి తార ఖుష్బూ నిండుగా పైట చుట్టుకొని బొట్టుతో ఆకర్షణీయంగా మృదుమదురంగా పత్రికా(25–1)' ముఖంగా

కిర్తికిష్టయ్య లక్ష్మిదేవిపల్లి

* * *

9–15 మే 86 వారపత్రికలో సర్పయాగం సరియల్ ప్రారంభంలోనే మమ్ములను ఎంతగానో ఆకర్షించింది

– చోడాబత్తుల సత్యనారాయణ సరోజ కుప్పనపూడి

## కథలు

2–8 మే బాలకృష్ణ విజయశాంతి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా అకర్షనీయకంగా ఉన్నది బానిస బ్రతుకులు ఎద్దకథ కథలు వ్యర్థపరివర్తనం బ్లెస్డ్ విత్‌సన్ చాలా బావున్నాయి

నాగంత్ల వెంకటేశ్వర్రావు ఇతరులు అమ్మాపాలెం డోర్నకల్

## శీర్షికలు

బాలకృష్ణ విజయశాంతిల ముఖ చిత్రంతో వెలువడిన ఆంద్ర సచిత్ర వారపత్రిక లో సెక్స్ ఎజ్యుకేషన్ అవసరమా అన్న శీర్షికలో విద్యార్థుల అబిప్రాయాలు చాలా బాగున్నవి

– యరబోలు చిట్టిబాబు

– కర్రి సన్యాసరావు అకివీడు

* * *

2–5–86 సంచికలో ప్రచురించిన సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా అన్న శీర్షికలో వివిధ విద్యార్థి విద్యార్థినుల వ్యాసాలు చాల బాగున్నాయి

– యస్ ఏ రమణారావు బ్రాహ్మణతర్లా